# యువ విజేతలు



మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా ఉదయతారగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi Enclave, Amman koil street,
Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

## బాక్సింగ్ బరిలో చిన్నారి

ధనశ్రీ సంజయ్ ఠాకూర్ మహారాష్ట్రలోని కల్యాణ్ నగరానికి చెందిన 12 ఏళ్ల బాలిక. పదేళ్లవయసులో తాను చదువుతున్న న్యూ వాణి విద్యాలయలో బాక్సింగ్ నేర్చుకోవడం ప్రారంభించింది. సాగర్ పెడ్నెకర్, మిలన్ వైద్య వద్ద ఆమె శిక్షణ పొందింది. తర్వాత ఈమె థానెలోని ఎచీవర్స్ బాక్సింగ్ క్లబ్ తరపున ఆడటం ప్రారంభించింది. గత సంవత్సరం ఈ క్లబ్ తరపున స్వర్ణ పతకం కూడా సాధించింది. పైగా రాష్ట్రస్థాయి ఛాంపియన్‌షిప్స్‌లో ఉత్తమ బాక్సర్‌గా బహుమతి కూడా గెల్చుకుంది. ధనశ్రీ తల్లిదండ్రులు ఆమెకు చక్కగా సహకరించారు.

ఎడమచేతితో ఆమె కురిపించే ముష్టి ఘాతాలను తట్టుకోవడం ఆమె ప్రత్యర్థులకు సాధ్యం కావడం లేదు. తమిళనాడులో ఇటీవలే నిర్వహించిన జాతీయ ఛాంపియన్‌షిప్ పోటీల్లో ఈ విషయం చక్కగా రుజువైంది. ఒక పోటీలో ధనశ్రీ తన ప్రత్యర్థులను కేవలం 30 సెకన్లలో మట్టిగరిపించింది. ఈ పోటీల్లో సబ్ జూనియర్ విభాగంలో ఈమె కంచు పతకం సాధించింది.

12 ఏళ్ల వయసులో బాక్సింగ్‌లో శిక్షణ పొందడం చాలా కష్టమైన పని. కానీ, ధనశ్రీ చదువు కొనసాగిస్తూనే తన శిక్షణను సాగించింది. అయిదుసార్లు ప్రపంచ ఛాంపియన్‌గా నిలిచిన ఎమ్‌సి మేరీ కామ్ ఆమె అభిమాన క్రీడాకారిణి. తను మెచ్చిన క్రీడాకారిణితో ఏనాటికైనా బరిలో తలపడాలన్నది ఈ చిన్నారి కోరిక. ఆమె వ్యక్తిత్వానికి తగిన రీతిలో ఆమె బ్లడ్ గ్రూప్ కూడా బి-పాజిటివ్ కావడం విశేషం. అన్నివేళలా సానుకూల దృక్పథం కలిగి ఉండాలని ఈమె కోరిక.




Shop

Archives from 1947

Jokes
Visit the new chandamama.com



February 2012 ₹20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**General Manager :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 February 2012 Issue-02



© The stories, articles and designs contained in this issue are the exclusive property of the Publishers. Copying or adapting them in any manner/ medium will be dealt with according to law.

ప్రియమైన పాఠకులకు!!!

కనురెప్పపాటులో మనం 2012లోకి అడుగుపెట్టడమే కాకుండా పని రీత్యా ఇప్పటికే రెండో నెలలోకి ప్రవేశించాము కూడా.

నూతన సంవత్సరాన్ని సాదరంగా ఆహ్వానిస్తున్న ఉద్వేగ క్షణంలో, మనందరం కొత్త సంవత్సరంలో నిర్వర్తించవలసిన పనుల గురించి తీర్మానాలు చేసుకుని ఉంటాము. ఇప్పుడు వాటిని చిత్తశుద్ధితో అమలు పెట్టవలసిన సమయం వచ్చేసింది.

చందమామలో మేము కూడా ఊరిస్తున్న కొత్త సంవత్సరం కోసం సన్నద్ధమవుతున్నాము. ఈ వేసవి సెలవుల్లో మా పాఠకులకు కొన్ని విశిష్ట అంశాలను అందివ్వడానికి పథకం రచిస్తున్నాము. మా బృందం కొన్ని కొత్త అంశాల గురించి ఆలోచించింది. రాబోయే నెలల్లో వీటిని అమలు పెడతామని ఆశిస్తున్నాము.

ఈ నెలలో, మనం పరిణామ సిద్ధాంతకర్త చార్లెస్ డార్విన్, చత్రపతి శివాజీ జన్మదినం జరుపుకుంటాము. డార్విన్ తన పరిశోధన, బౌద్ధిక విశ్లేషణ ద్వారా మానవజాతి పరిణామంపై అద్వితీయ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఇది భూమిపై జీవం, దాని పరిణామంపై మన అవగాహననే సమూలంగా మార్చివేసింది. కాగా ఛత్రపతి శివాజీ తన మానసిక ప్రతిభ, సాహస ప్రవృత్తిని ఉపయోగించి సకల అణిచివేతలకు వ్యతిరేకంగా నాయకత్వం వహించడం ద్వారా చరిత్ర సృష్టించాడు. ఈ క్రమంలో ప్రజలను విముక్తి చేసి, తన స్వంత సామ్రాజ్యం స్థాపించాడు. ఒక ఆదర్శ పాలకుడిగా చరిత్రలో నిలిచిపోయాడు.

ఈ నెల కథల నిధి మీ కోసం రాబోతోంది.

– సంపాదకులు





# పాఠకుల లేఖలు



మా నాన్న ఒరియా చందమామను 1970 నుంచి చదువుతున్నారు. గత ఐదేళ్లుగా చందమామను చదువుతున్న నాకు మామ కథలంటే చాలా ఇష్టం. - *debabratatarai8@ovi.com*

ఇంగ్లీషు, బెంగాలీ చందమామలు రెండింటిలోనూ క్రీడలు, కార్టూన్‌లు, క్విజ్, భారతీయ చరిత్ర, పిల్లల సినిమాలు వంటి వాటిని ప్రచురించండి. - అర్నాబ్ భట్టాచార్య (*13* సంవత్సరాలు)

బేతాళ కథలో పూర్తి పేజీ చిత్రం అద్భుతంగా ఉంది. చందమామ చరిత్రలో బేతాళ కథకు పూర్తి పేజీ చిత్రం వేయడం ఇదే తొలిసారి అనుకుంటాను. - కుషాల్ చంద్ సాహు చాంపా, ఛత్తీస్‌గఢ్

'రైతే రాజు' కథ చాలా బాగుంది. సేద్యంపై పాలకులకు గౌరవం, విలువ లేకుండా పోయిన కాలంలో రైతులు నిరసనగా లక్షలాది ఎకరాల్లో పంట విరామం ప్రకటించడం దేశానికే నష్టదాయకం. రాసినవారికి, చందమామకు కూడా అభినందనలు. - ఎ. శిరీష, ఏలూరు

'సమర్థత' కథ ముగింపు అర్థవంతంగా ఉంది. చిన్న కథల్లో 'దగ్గరసాయం' కథ చాలా బాగుంది. ఎవరికైనా మనం అందించే సాయం వాళ్లకు దగ్గరగా ఉండాలి. ఎంత చక్కటి భావమో ఇది. ఐశ్వర్యం రావడానికి కుట్టుసూది ఉన్నా చాలు అని చెప్పిన 'సూది చెప్పిన సౌభాగ్యం' కథ చక్కటి కథ. అభినందనలు. - కోటేషు, కరీంనగర్

'మెత్తటినేల' కథ అమ్మ గొప్పతనం గురించి అమృత వాక్యంతో అలరించింది. 'దేవుడు అన్ని చోట్లా తాను ఉండలేక లోకంలో అమ్మను సృష్టించాడు' వాక్యం నిజంగా అమ్మ విలువ గురించిన అద్భుతమైన ప్రకటన. అలాగే 'అవిశ్వాసం' కథ మాటకున్న శక్తిని చాలా గొప్పగా చెప్పింది. 'మీరేమో నన్ను దొంగ అనుకున్నారు. నేనేమో మిమ్మల్ని పెద్దమనిషి అనుకున్నాను' అంటూ చివరలో చెప్పిన వాక్యం మానవ సంబంధాలలో విశ్వాసం లోపిస్తున్న ఉదంతాన్ని ఎత్తి చూపింది. ఇక లాభాపేక్ష వస్తువుల నాణ్యతను దెబ్బతీయడం గురించి చెప్పిన 'పోటీ' పాత చందమామ కథలాంటి చక్కటి కథ. చందమామ కథలంటే ఇలా ఉండాలి. - ఎ. శ్రీనివాస్, చిత్తూరు

చందమామలో వస్తున్న కథలు చాలా బాగున్నాయి. అలాగే చిత్రాలు కూడా అలరిస్తున్నాయి. వపా చిత్రాలంటే నాకు ఎంతో ఇష్టం. వపా చిత్రాలకోసమే 2000 సంవత్సరం నుంచి చందమామలు క్రమం తప్పకుండా కొంటున్నాను. వపా చిత్రం లేని చందమామను ఊహించుకోలేకపోతున్నాము. పాతవైనా పరవాలేదు. వపా గారి చిత్రాలనే కవర్ పేజీపై వేయగలరు. ఈ మధ్య కాలంలో చిత్రా, శంకర్ గార్ల చిత్రాలు కవర్ పేజీపై వేస్తున్నారు. చాలా బాగున్నాయి. అలాగే వపాగారి పాత చిత్రాలు అట్టవెనుక ఇదివరకు ప్రచురించేవారు. నా ఉద్దేశంలో కవర్ పేజీపై వపా చిత్రాలు చాలా బాగుంటాయి. - మాధవ్, పాతపట్నం, శ్రీకాకుళం

చందమామలో మార్పులు కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి. పాత ముఖచిత్రాలను మాత్రమే వేయడం, కథల సంఖ్య బాగా పెంచడం, పూర్తి పేజీ చిత్రాలను ఒకటి రెండు ప్రతి సంచికలో వేయడం, పాత కథలను పాతశైలిలో వేయడానికి శ్రద్ధ తీసుకోవడం బాగుంది. చందమామ కథకుడిగా కూడా నన్ను తీర్చిదిద్దింది. కథ రాయడం, పాత్రోచితంగా భాషను వాడటం,

చందమామ కోసం ఒక ప్రత్యేక శైలిని అలవర్చుకోవడం ఇవన్నీ చందమామే మాకు నేర్పింది. అందుకే చందమామను మేము ఎన్నటికీ మర్చిపోలేము. ఆధునిక పరిసరాలకు, కథలకు భిన్నంగా చందమామను పాతశైలిలోనే తీర్చిదిద్దగలరని ఆశిస్తున్నాము.

– జొన్నలగడ్డ నారాయణమూర్తి, హైదరాబాద్

నా పాత కథ 'ఉత్తమ వైద్యుడు'ను పునర్ముద్రించినందుకు కృతజ్ఞతలు. చక్కని కథలను చూడ చక్కని చిత్రాలతో నవీనంగా రూపొందించి, పత్రికకు పూర్వ వైభవం పునరావృతం చేస్తున్న చందమామకు నా అభినందనలు. కొత్తతరం పిల్లల కోసం కొత్త కథలను కూడా వేస్తున్నందుకు సంతోషం. – నందిరాజు పద్మలతా జయరాం, హైదరాబాద్

నేను మహారాష్ట్రలో ఎలక్ట్రికల్ బోర్డులో పనిచేస్తున్నాను. మా పిల్లలు స్కూల్ లైబ్రరీలో హిందీ చందమామ, ఇంగ్లీషు చందమామ ఎంతో ఇష్టంగా చదువుతుంటారు. చందమామను చదువుతున్న మా పిల్లలు 'చందమామలో నీ కథ ఎందుకు రాదు నాన్నా, తప్పకుండా చందమామకు కథలు పంపించు' అని బలవంత పెట్టడంతో ఇటీవలే చందమామకు కథలు పంపించాను. ఇన్ని సంవత్సరాలుగా చందమామ ఇన్ని భాషల్లో కొనసాగడం నిజంగా పత్రికకు, పాఠకులకు కూడా గర్వకారణం. – మల్ల లక్ష్మీనారాయణ, చంద్రాపూర్, మహారాష్ట్ర

నేను దాదాపు 55 సంవత్సరాల నుండి చందమామ పాఠకురాలిని. నవంబర్ నెలలోని చిన్న కథ 'పోటా పోటీ' పరమానంద శిష్యుల కథకు నకలు. ఇలాంటి కథలెందుకు ప్రచురిస్తున్నారు? 'అబద్ధం ఖరీదు'లో లాటరీ టికెట్ చోటు చేసుకోవడం చందమామని దిగజార్చినట్లే లెక్క. చిత్రీకరణం కూడా అంత బాగా లేదు. 'షరతు' కథలోని సైకిల్ చిత్రం ఒక్క క్షణం నేను చందమామనే చదువుచున్నానా అనే అనుమానం కలుగ జేసింది. 'అమూల్యం' కథ ఎలా ఉన్నప్పటికీ 21వ శతాబ్దంలో ఉన్నట్లు తోచింపజేసింది. ఆధునిక యుగంలోకి అడుగు పెడుతున్న చందమామ పూర్వపు వైభవాన్ని కోల్పోతోంది. నవంబర్ నెల ముఖచిత్రం గురించి... ఇక నేను మాట్లాడను.

– డా. పి ప్రభావతి భట్టిప్రోలు, హైదరాబాద్

బేతాళ కథ 'అమృతవర్షిణి నిర్ణయం' చాలాబాగుంది. శంకర్ గారి చిత్రాలు అద్భుతం. ముఖ్యంగా పూర్తి పేజీలో ఆయన వేసిన గద్ద చిత్రం చందమామకు పాత వైభవాన్ని తెచ్చి పెట్టింది. పేపర్ నాణ్యత లేక బొమ్మలు తేలిపోవడం చందమామకు మంచిది కాదు. ఆస్తి పంపకం, ఇంటిపెత్తనం కథలు నిఖార్సయిన పాత కథలు. అపార్థం కథ హృద్యంగా ఉంది. – చంద్రమోహన్, గుంటూరు

14వ ఏటనుంచి చందమామ చదువుతున్నాను. చందమామ కథలు పురాతనత్వాన్ని గుబాళిస్తుంటాయి. ఒకానొకప్పుడు.. అనగనగనగా.. అంటూ మొదలయ్యే కథలు మమ్మల్ని గతకాలపు అంచులదాకా తీసుకెళతాయి. చందమామ కథల్లోకి 20వ శతాబ్దం రాకూడదు. చందమామ సజీవంగా ఉందంటే నాటి చిత్రా వేసిన అపురూప చిత్రాలతో కూడిన పాత సీరియల్స్‌తో పాటు నేటికీ శంకర్ గారు వేస్తున్న వర్ణచిత్రాలు. చిత్ర వర్ణాలతో చందమామకు నిజమైన ఆత్మను సృష్టించిన వాడు చిత్రా. చందమామలో మోడరన్ కథలు ప్రచురించకండి. 'ఒకానొకప్పుడు...' అనే వాక్యంతో కథలు మొదలవుతాయని ఆశిస్తూ.. – డ్యాక్టర్ ఎ. శ్రీనివాసరాజు, హన్మకొండ

**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**



**Chandamama!**

Because stories make the world go round...

**Choose your Chandamama!**

**Go to www.chandamamashop.com & subscribe Now!!**



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years**
**is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ................................................................................

Date of Birth: .............................. Sex :..............................

Address: ................................................................................

................................................................................

................................................................................

.............................................. City: ..............................

State:.................................. Pin:..................................

Telephone:................................................................................

Mobile:................................................................................

Email:................................................................................

Subscription Number (for renewals):..........................................

Gift Subscription to the following address:

................................................................................

................................................................................

................................................................................

................................................................................

Enclosed Cheque/DD* for Rupees..........................................

Cheque/DD No ................................................................

favouring Chandamama India Ltd on..........................................

................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited.**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| English (₹ 25/- per copy) | ₹300 | ₹540 $80 | ₹765 $135 | ₹960 $240 | ₹1125 $375 |
| REGIONAL (₹ 20/- per copy) | ₹240 | ₹430 $50 | ₹610 $110 | ₹770 $190 | ₹900 $300 |
| JUNIOR (₹ 15/- per copy) | ₹180 | ₹325 $35 | ₹460 $80 | ₹575 $145 | ₹675 $255 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

## చందమామతో నా జ్ఞాపకాలు - తెలుగు

చక్రపాణిగారి సృజనాత్మక మార్గదర్శకత్వంలో చందమామ పత్రిక ప్రారంభించబడినప్పుడు నేను పాఠశాలకు వెళ్తుండేవాడిని. రంగుల చిత్రాలు, చక్కటి రూపకల్పన, ఆసక్తికరమైన పొట్టి కథలు, కార్టూన్లు వగైరాలకు చందమామ పెట్టింది పేరు. చిన్న పిల్లలుగా మేము చందమామను తొలి నుంచి చివరి పుటవరకు వదలకుండా చదివి స్నేహితులతో పంచుకునేవాళ్లం.

మలి సంచిక ఎప్పుడొస్తుందా అని మేము ఆత్రుతతో ఎదురు చూసేవాళ్లం. ఆసక్తే కాదు, విద్యాపరంగా కూడా అదొక గొప్ప విలువగా ఉండేది. హత్తుకుపోయే కథలతో చందమామ పిల్లల మనస్సులలో ఉన్నత విలువలను చొప్పించి మంచి పౌరులుగా తీర్చి దిద్దేది.



Name: P. Parameswara Rao
Occupation: Sr. Advocate, Supreme Court, Noida

ఒకసారి నా తరగతి మిత్రుడైన చాగలకొండ సూర్యనారాయణ ఒక కథ రాశాడు. వినాయకుడు ఎందుకు పెళ్లి చేసుకోలేదు అన్నది కథ సారాంశం. ఈ కథను చందమామలో బొమ్మలతోపాటు ప్రచురించారు. అతడి పేరుకన్న అతడి కథ చందమామలో ప్రచురించబడటం చూసి మేము పరవశించిపోయాము.

చిన్నపిల్లలంగా చందమామ పత్రిక చూపించే అద్భుత ప్రపంచంలోకి అడుగు పెట్టాము. ఉన్నత విద్య కోసం నేను కళాశాలలో చేరినతర్వాత కూడా చందమామ పత్రికతో చక్కటి అనుబంధాన్ని కొనసాగించాను. ఎప్పుడైనా, ఎక్కడైనా చందమామను చూస్తే వెంటనే దాన్ని పట్టుకుని పుటల్లోకి వెళ్లిపోతుంటాను.

ఈ పత్రికను ప్రారంభించిన చక్రపాణి గారినే కాకుండా తెలుగు లోగిళ్లలో, విదేశాలలో కూడా దీనికి చిరస్మరణీయ స్థానం కల్పించిన పత్రిక సిబ్బంది, వారసులకు కూడా అభినందనలు తెలుపుతున్నాను.

ఇటువంటి దార్శనిక ప్రయత్నాల ద్వారానే మనం బలమైన, ఐక్య భారతదేశాన్ని నిర్మించగలము. ఈ రకంగానే దేశ భవిష్యత్తుకు సంకేతాలైన పిల్లలలో సౌభ్రాతృత్వాన్ని ప్రోత్సహించడమే కాకుండా ఉన్నత విలువలను వారిలో ప్రతిష్ఠించగలం.

## చందమామతో నా జ్ఞాపకాలు - మరాఠీ

చిన్నతనంలోనే నాకు చందమామతో పరిచయం కలిగింది. చందమామ కోసం నా సోదరుడూ, నేను ఆత్రుతగా వేచి చూసేవాళ్లం. మా నాన్న ఉపాధ్యాయుడు. ప్రతి నెలా మొదటి వారంలో నాన్న చందమామను తీసుకువచ్చేవాడు. రాగానే పత్రికను ముందుగా ఎవరు చదవాలని మేమిద్దరమూ పోట్లాడుకునేవాళ్లం. తర్వాత చందమామను నెలకు ఒకరు చొప్పున ముందుగా చదివేసి ఆపై ఇతరులకు ఇవ్వాలని ఒక ఒప్పందానికి వచ్చాము.

చందమామను చదవడం అంటే మాకు పండుగతో సమానం. ఈ రోజుకూ ఇది కొనసాగు

తూనే ఉంది. చిన్నప్పుడు చదివినంత ఉత్సాహంతోనే ఇప్పటికీ నేను పత్రికను చదువు తుంటాను. చదవడం మొదలెడితే చివరిపేజీ వరకు అదే ఆసక్తితో చదువుతుంటాను. పరీక్షల కాలంలో అయితే చందమామను చదవడంకోసమే పరీక్షలు ఎంత త్వరగా ముగిసిపోతా యని ఎదురు చూసేవాళ్లము. పాఠశాల రోజుల్లో నేను చదివిన చందమామ కథలను ఈరోజుకీ



Name: Varsha Bale
Occupation: Lawyer
Margoo, Goa

నేను గుర్తు పెట్టుకున్నాను. అప్పట్లో నేను చదివిన రామాయణం, మహాభారతం కథలను ఇప్పటికీ నేను మర్చిపోలేదు. తర్వాత నేను ఇతర రామాయణ, మహాభారత గ్రంధాలను చదివినప్పటికీ చందమామలో నేను చదివిన కథలే నా దృష్టిలో చాలా గొప్పవి.

నా సోదరుడికి చందమామ అంటే ఎంత ఇష్టమంటే ఎవరికీ పత్రికను ఇవ్వడు. చందమామ అన్ని సంచికలను అతడు ఒక కొయ్య పెట్టెలో వేసి భద్రపర్చాడు. కాని కొన్నాళ్లకు చెదలు కార ణంగా ఆ పుస్తకాలు పాడైపోయినట్లు గమనించగానే మేం చాలా బాధపడ్డాము. ఈరోజు మాపిల్లలు చందమామను ఆసక్తిగా చదువుతుండటం చూస్తున్న ప్పుడల్లా నా బాల్యం గుర్తుకొస్తుంటూంది. నా కూతురికి. చందమామ అంటే తెగ పిచ్చి. పత్రికను చదవడం మొదలెట్టిందంటే నిద్రాహారాలు మర్చిపోతుంది.

నా బాల్య స్నేహితురాలైన చందమామ మాపిల్లలకు కూడా అత్యంత సన్నిహిత మిత్రు రాలిగా ఉంటోంది. నా బాల్యంలో మధురానుభూతులను పంచిపెట్టిన చందమామ పట్ల జీవితాంతం కృతజ్ఞురాలినై ఉంటాను. చందమామ దినదినాభివృద్ధి పొందాలని కోరుకుం టున్నాను. చందమామకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు.

## చందమామతో నా జ్ఞాపకాలు - కన్నడ

మాది కర్నాటక రాష్ట్రం గడగ్ జిల్లా నరగుండ తాలూకాలోని షిరోలా గ్రామం. నేను గత 30 సంవత్సరాలుగా చందమామను చదువుతున్నాను. చందమామ ప్రచురించే అర్థవంతమైన నీతికథలు, బేతాళ కథలు అంటే మాకు చాలా ఇష్టం. మా స్నేహితులమంతా వంతులు వేసు



Name: P. Chidambara
Nimbaragi. Gadag
(Dist), Karnataka.

కుని మరీ చందమామను చదివేవాళ్లం. చందమామలో బొమ్మలంటే మరీ ఇష్టం మాకు. ఆ బొమ్మలే చందమామ కథను విప్పి చెప్పేవి. వాటిలో కొన్ని చిత్రాలను వేయడానికి కూడా ప్రయత్నించేవారం. ఈ బొమ్మలే చందమామను జనరంజకం చేశాయని నా ఉద్దేశం.

చందమామ పేరుకు తగినట్లుగానే అందమైనది. 'చంద' అంటే కన్నడలో 'అందమైన' అని అర్థం. చిన్నపిల్లలను చదివించడంలో చందమామకు సాటిలేదు. పిల్లలకు ఇది నిజమైన బహుమతి, విజ్ఞాన శిఖరం కూడా.

## బేతాళ కథలు

# అనంతుడి ఆంతర్యం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్లి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగానే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా! నువ్వు ఎవరి మేలు కోసం ఇంతటి కష్టసాధ్య మైన కార్యానికి పూనుకున్నావో నాకు బోధ పడడం లేదు. కొందరు వ్యక్తులు మొదట మేలు తలపెట్టినా చివరికి వచ్చేసరికి అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తారు. నువ్వు అటువంటివాడివేమో ఆత్మ పరిశీలన చేసుకోవడానికి వీలుగా నీకు అనంతుడి కథ చెబుతాను శ్రమ తెలియకుండా విను,' అంటూ ఇలా చెప్పసాగాడు.

వింధ్యవర్ధని రాజ్యానికి రాజు అశోకవర్ధనుడు. అతని రాజ్యానికి దక్షిణ దిశగా నైమిశారణ్యం ఉండేది. అందులో సిద్ధయోగి అనే మునీశ్వరుడు గురుకులం నడిపేవాడు. సిద్ధయోగికి తెలియని ధర్మ



శాస్త్రాలు గాని, వీరవిద్యలు గాని లేవు. అందుకే ఎందరో రాజులు తమ బిడ్డలను సిద్ధయోగి వద్ద శిష్యులుగా చేర్పించడానికి ఇష్టపడేవారు.

అశోకవర్ధనుడు కూడా తన కుమారుడైన హర్షవర్ధనుడిని, సిద్ధయోగి సమక్షానికి తీసుకుపోయి 'మునీశ్వరా! నా కుమారుడిని శిష్యుడిగా స్వీకరించి భావి మహారాజుగా తీర్చిదిద్దండి,' అని కోరాడు. సిద్ధయోగి అందుకు సమ్మతించాడు.

అదే సమయానికి పురుషోత్తముడు అనే రైతు తన కుమారుడైన అనంతుడిని, సిద్ధయోగి వద్దకు తెచ్చి 'మహానుభావా! నా కుమారుడికి వేద విద్యల పట్ల, వీర విద్యల పట్ల ఆసక్తి ఎక్కువ. అందుకే మీ వద్దకు తీసుకువచ్చాను. శిష్యుడిగా స్వీకరించి మంచి భవిష్యత్తును ప్రసాదించండి,' అని కోరాడు. సిద్ధయోగి, అనంతుడిని కూడా శిష్యుడిగా స్వీకరించాడు.

హర్షవర్ధనుడు, అనంతుడు గురువు చెప్పే విద్య పట్ల అమితమైన శ్రద్ధ చూపేవారు. సిద్ధయోగి వారిరువురూ సమ ఉజ్జీలని గ్రహించాడు. అయితే హర్షవర్ధనుడు ప్రతిసారీ అనంతుడిని మించి ప్రతిభ కనబరచాలని ఆరాట పడేవాడు.

అనంతుడు మాత్రం హర్షవర్ధనుడిని రాజకుమారుడిగా గౌరవించేవాడు, అభిమానం చూపేవాడే గానీ అసూయ పడేవాడు కాదు. రాజకుమారుడిని మించిపోవాలని తాపత్రయ పడేవాడు కాదు.

ఒక రోజు యాగానికి అవసరమైన సమిధలు ఏరడానికి విద్యార్థులందరూ కలసి అరణ్యంలోకి వెళ్ళారు. అప్పుడు ఒక భల్లూకం వారి మీద దాడి చేసింది. విద్యార్థులు భల్లూకాన్ని చూసి పారిపోయారు. హర్షవర్ధనుడు ధైర్యంగా దాన్ని ఎదుర్కొన్నాడు. కాని దాని బలం ముందు నిలువలేకపోయాడు. అంతలో అనంతుడు, హర్షవర్ధనుడిని ప్రక్కకు నెట్టి, భల్లూకంతో కలబడ్డాడు. భల్లూకంతో పోరులో తీవ్ర గాయాలైనా అనంతుడు వెరవ లేదు.

శిష్యుల ద్వారా భల్లూకం విషయం తెలుసుకున్న సిద్ధయోగి అక్కడకు వచ్చి భల్లూకం మీద మంత్రజలం జల్లాడు. అంతటితో భల్లూకం స్పృహ తప్పి పడిపోయింది.

సిద్ధయోగి, తీవ్ర గాయాలైన అనంతుడిని ఆశ్రమానికి తీసుకుపోయి మూలికా వైద్యం చేసాడు. అనంతుడు వారం రోజులకు గానీ కోలుకోలేక పోయాడు.

ఒక రోజు హర్షవర్ధనుడు దూరంగా ఉన్న సమయాన సిద్ధయోగి 'అనంతా! హర్షవర్ధనుడిని ప్రాణాలకు తెగించి కాపాడావు. నీకు ప్రాణంమీద తీపి లేదా?' అని అడిగాడు.

అందుకు అనంతుడు 'గురువర్యా! హర్షవర్ధనుడు భావి మహారాజు. ఒక సామాన్యుడినైన నాప్రాణం కంటే అతడి ప్రాణం విలువైనది. అందుకే అలా చేసాను' అని చెప్పాడు.

సిద్ధయోగి, అనంతుడి వంక ప్రశంసా పూర్వకంగా చూసాడు.

హర్షవర్ధనుడు, అనంతుడు వీరవిద్యలన్నింటిలో సమంగా ఉన్నా విలువిద్యలో మాత్రం అనంతుడిది పై చేయిగా ఉండేది. ఆ విషయంలో హర్షవర్ధనుడికి తీవ్రమైన అసంతృప్తి ఉండేది. అందుకే అనంతుడ్ని మించి ప్రతిభ కనబరచడానికి తీవ్రమైన కృషి చేసేవాడు.

ఒక పర్యాయం సిద్ధయోగి విద్యార్థులను రెండు జట్టులుగా విడగొట్టి విలువిద్య పోటీ పెట్టాడు. చివరిగా హర్షవర్ధనుడు, అనంతుల మధ్య పోటీ జరిగింది.

సిద్ధయోగి ఒక పూల దండను చెట్టు కొమ్మకు తగిలించి బాణంతో ఆ పూల దండను కాసింత దూరంలో ఉన్న దేవతా విగ్రహం మెడలో పడేలా చేయమని పరీక్ష పెట్టాడు. అంతేకాదు.. పూలదండలోని





పోటీలో కావాలనే ఓడిపోయావని నేను గ్రహించాను. ఎందుకలా చేసావు?' అని ప్రశ్నించాడు.

అందుకు అనంతుడు 'గురుదేవా! హర్షవర్ధనుడు విలు విద్యలో నా కంటే తక్కువగా భావించి ఆత్మన్యూనతా భావం పెంచుకుంటున్నాడు. అతనిలో ఆత్మ విశ్వాసం నింపడానికే నేను కావాలని ఓడి పోయాను,' అని చెప్పాడు. సిద్ధయోగి అనంతుడివంక మెచ్చుకోలుగా చూసాడు.

విలువిద్య పోటీలో తను గెలుపొందాక హర్షవర్ధనుడు, అనంతుడిని చిన్నచూపు చూడసాగాడు. తోటి విద్యార్థుల దగ్గర తనంతటి గొప్పవాడు లేడని, అనంతుడి లాంటి పదిమందిని ఏక కాలంలో ఓడించ గలనని గొప్పలు చెప్పుకోసాగాడు.

అందుకు అనంతుడు బాధ పడేవాడు కాదు గాని, నిజం తెలిసిన సిద్ధయోగి మాత్రం బాధపడేవాడు.

ఒక పర్యాయం సిద్ధయోగి, అనంతు డిని చేరబిలిచి, 'నాయనా! నా దగ్గరున్న శిష్యులందరిలో నీవు ఉత్తముడివి. నాకు ప్రియతముడివి. గురువు ఎప్పుడూ మరె వరికీ నేర్పని కొన్ని మెళకువలను తన ప్రియ తమ శిష్యుడికి, నేర్పుతాడు. అందుకే ఖడ్గ చాలనంలోని కొన్ని రహస్య మెళకువలు నీకు నేర్పుతాను' అన్నాడు.

అందుకు అనంతుడు 'గురుదేవా! మీరు నాపై చూపుతున్న అభిమానానికి కృతజ్ఞుడిని. అయితే నా అభ్యర్థన ఏమంటే

ఒక పువ్వు కూడా నేలరాలరాదని షరతు పెట్టాడు. క్లిష్టమైన ఆ పరీక్షలో ఎవరు నెగ్గుతారోనని శిష్యులందరూ ఆసక్తి కన బరిచారు.

తొలుత హర్షవర్ధనుడు వేసిన బాణం సూటిగా పోయి పూలదండను తాకింది. మరుక్షణం పూలదండ వెళ్ళి దేవతా విగ్రహం మెడలో పడింది. ఒక్క పూవు కూడా నేల రాలలేదు.

తరువాత అనంతుడు వేసిన బాణం పూలదండను సరిగ్గా దేవతా విగ్రహం మెడలో పడేసింది గాని.. కొన్ని పూలు నేల రాలాయి. సిద్ధయోగి హర్షవర్ధనుడిని విజే తగా ప్రకటించాడు.

ఆ రాత్రి విద్యార్థులందరూ నిద్రించాక సిద్ధయోగి అనంతుడితో 'అనంతా! నీవు

ఆ మెళకువలు హర్షవర్ధనుడికి నేర్పండి. ఎందుకంటే నాకంటే అతడికి శత్రుభయం ఎక్కువ. ఖడ్గచాలనంలోని ఆ మెళకువలు అతడికి మరింత ఉపయోగపడగలవు,' అని కోరాడు.

అప్పుడు సిద్ధయోగి 'అనంతా! నీవంటి స్నేహితుడిని పొందిన రాజకుమారుడు అదృష్టవంతుడు,' అన్నాడు.

కొద్ది సంవత్సరాలకు వారి విద్యాభ్యాసం ముగిసింది.

చివరిసారిగా విద్యార్థుల మధ్య సిద్ధ యోగి పోటీలు పెట్టదలిచాడు.

ఆ పోటీలకు హాజరుకమ్మని మహా రాజుతో పాటు అందరి తల్లిదండ్రులకు వర్తమానం పంపాడు.

మహారాజుతో పాటు అందరూ ఎంతో ఆసక్తితో ఆ పోటీలకు హాజరు అయ్యారు.

అన్ని పోటీల్లో హర్షవర్ధనుడు, అనం తుడు ప్రథములుగా నిలిచారు. చివరిగా సిద్ధయోగి వారిరువురి మధ్య కత్తియుద్ధం పోటీ పెట్టాడు.

వారిరువురు పోటాపోటీగా చాలాసేపు కత్తి యుద్ధం చేసారు. వారి చేతుల్లోని ఖడ్గాలు మెరుపు వేగంతో కదలాడాయి. కొంతసేపటికి అనంతుడు ఒక అసాధారణ ప్రక్రియతో హర్షవర్ధనుడి చేతిలోని కత్తిని ఎగరగొట్టాడు. సిద్ధయోగి అనంతుణ్ని విజేతగా ప్రకటించాడు.

అనంతుడు తన తండ్రితో కలసి గ్రామా నికి బయలుదేరే సమయాన సిద్ధయోగి



అనంతుడిని చేరబిలిచి 'నాయనా! నీవు వీరుడివే కాదు. వివేకవంతుడివి కూడా. అంతకు మించి నిజమైన స్నేహితుడివి' అని అభినందించాడు.

అనంతుడు గురువు పాదాలకు భక్తితో నమస్కరించి బయలుదేరిపోయాడు.

అంతవరకూ కథ చెప్పిన బేతాళుడు 'రాజా! ఒకపర్యాయం అనంతుడు ప్రాణా లకు తెగించి భల్లూకం బారినుంచి రాజ కుమారుడిని కాపాడాడు. మరో సంద ర్భంలో రాజకుమారుడిలో ఆత్మ విశ్వాసం నింపడానికి కావాలని విలువిద్య పోటీలో ఓడిపోయాడు.

అటువంటి అనంతుడు విద్యాభాసం ముగిసిన సమయంలో అందరిముందు హర్షవర్ధనుణ్ని చిత్తుగా ఓడించాడు.

అతడు ఎందుకలా ప్రవర్తించాడు? అందరిముందు తన గొప్పతనం ప్రదర్శించడానికా? లేక ఓడిపోయి తన తండ్రి మనసు నొప్పించడం ఇష్టం లేకనా?

అలా కానిపక్షాన మహారాజు ముందు తన శక్తియుక్తులు ప్రదర్శిస్తే తనకు మంచి పదవి దొరకగలదన్న ఆశతోనా? అలాగే సిద్ధయోగి, అనంతుడిని వివేక వంతుడని, నిజమైన స్నేహితుడని అభినందించడం ఈ సందర్భంగా ఎంతవరకు సమంజసం?' అని ప్రశ్నించాడు.

అప్పుడు విక్రమార్కుడు 'బేతాళా! అనంతుడు, రాజకుమారుడిలో ఆత్మ విశ్వాసం నింపడానికి చేసిన ప్రయత్నం అతడిలో అహంకారాన్ని నింపింది.

అందుకే రాజకుమారుడు, గతంలో అనంతుడు తన ప్రాణం కాపాడిన వైనం కూడా మరచి అతన్ని పదేపదే చిన్నచూపు చూసాడు. తోటి విద్యార్థుల దగ్గర తూలనాడాడు. కాబోయే రాజుకు అసలు ఉండకూడనిది అహంకారం. రాజు అహంకారం అతనికే కాదు... రాజ్యానికి కూడా చేటు తెస్తుంది.

అది గ్రహించబట్టే అనంతుడు, హర్షవర్ధనుడిలోని తనను మించిన వాడు లేడన్న అహంకారం పార్రదోలడానికి, అతన్ని ఓడించాడు. అంతేగాని.. తండ్రిని సంతోషపెట్టడానికి గాని... రాజు మెప్పు పొంది పదవి సంపాదించడానికి గాని ఎంత మాత్రం కాదు.

నిజమైన స్నేహితుడు, తన మిత్రుడి ఉన్నతి కోరుకుంటాడే గాని.. పతనాన్ని కాదు. ఆ విషయం అవగతం చేసుకోబట్టే, సిద్ధయోగి, అనంతుడిని వివేకవంతుడని... నిజమైన స్నేహితుడని ప్రశంసించాడు,' అని చెప్పాడు.

రాజుకి ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. - కల్పితం

(ఆధారం: ఎస్. శివ నాగేశ్వరరావు)





# కంటికి కనిపించని కానుక

స్వర్ణసునందిని రాజ్య రాజు ఆకాశదీప్తుడికి చాలా కాలంగా సంతానం లేదు. సంతానం కోసం రాజదంపతులు ఎన్నో యాగాలు, వ్రతాలు చేసారు. మునులను, యోగులను ఎందరినో కలిసారు.

చివరికి దైవం కరుణించి మహారాణి వకుళాదేవి గర్భం దాల్చింది. నెలలునిండి వకుళాదేవి పండంటి ఆడబిడ్డకు జన్మనిచ్చింది.

రాజదంపతుల ఆనందానికి అవధుల్లేవు. పుట్టిన బిడ్డకు స్వర్ణదీపిక అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచసాగారు.

ఏడాది గడిచింది. మహారాజు ఆకాశ దీప్తుడు యువరాణి జన్మదిన వేడుకలు ఘనంగా నిర్వహించాలని భావించాడు. ఆ సమయాన రాజ్యవాసులందరికి ఘనంగా విందు ఇవ్వాలని భావించి ఆ విషయమై చాటింపు వేయించాడు.

మహారాజు తామందరినీ విందుకు ఆహ్వానించినందుకు ప్రజలందరూ సంతోషభరితులయ్యారు. విందుకు వెళ్ళే సమయాన తమ శక్తి కొలదీ యువరాణికి ఏదో ఒక కానుక పట్టుకెళ్ళాలని భావించారు.

అదే రాజ్యంలో శివయ్య అనే చెప్పులు కుట్టేవాడు ఉండేవాడు. శివయ్యది మంచి మనసు. శివయ్య నిరుపేద కావడంతో ఏ రోజు సంపాదన ఆ రోజే ఖర్చయ్యేది. యువరాణి జన్మదినాన తను చెప్పులు కుట్టగా వచ్చే డబ్బుతో, తను పస్తుండైనా, ఆ పాపకు ఏదో ఒక కానుక కొని తీసుకువెళ్ళాలనుకున్నాడు.

అయితే ఆ రోజు శివయ్య దగ్గర చెప్పులు కుట్టించుకోవడానికి ఒక్కరు కూడా రాలేదు. అందుకు శివయ్య ఎంతో చింతించాడు. యువరాణికి చిన్నకానుక అయినా కొనలేక పోతున్న తన అశక్తతకు కుమిలిపోయాడు.

ఎన్. లలిత



ఏ కానుకా లేకుండా విందుకు వెళ్ళడం శివయ్యకు ఇష్టం లేదు.

అలాగని రాజుగారు ఎంతో ప్రేమగా పిలిచిన విందుకు వెళ్ళకపోవడం కూడా శివయ్యకు నచ్చలేదు.

చివరకు శివయ్య తన మనసు స్థిమిత పరుచుకొని ఏ కానుకా లేకుండానే విందుకు వెళ్ళడానికి నిర్ణయించుకున్నాడు.

శివయ్య విందు జరుగుతున్న ప్రదేశం చేరేసరికి అక్కడ వేలాది మంది ప్రజలు కనిపించారు. అందరూ వరుసలో నిలబడి యువరాణికి చదివింపుల కార్యక్రమంలో పాల్గొంటున్నారు.

రాజ సేవకులు కొందరు ప్రజలు ఇచ్చిన కానుకలను స్వీకరించి, ఇచ్చిన వారి పేరు, ఇచ్చిన కానుక వివరాలను వ్రాసుకుంటున్నారు.

శివయ్య మరోసారి యువరాణికి ఏం చదివించలేకపోతున్న తన పేదరికానికి బాధ పడ్డాడు.

వరుసలో నిలబడ్డ శివయ్యతో, రాజ సేవకుడు 'నీ పేరు, కానుక వివరం చెప్పు,' అన్నాడు.

అప్పుడు శివయ్య 'నా పేరు శివయ్య. కానుక వివరం దగ్గర కంటికి కనిపించని కానుక అని వ్రాసుకో!' అని చెప్పాడు.

అందుకు రాజసేవకుడు ఆశ్చర్యపోయి 'కానుక ఇవ్వకుండానే కనిపించని కానుక అని వ్రాసుకోమంటావేం?' అన్నాడు.

'చెప్పానుగా! కనిపించని కానుక అని. అది నీకే కాదు. ఎవరికీ కనిపించనిది' అన్నాడు శివయ్య.

ఆ సేవకుడు శివయ్యను మతిమాలినవాడిగా భావించి కానుక వివరం దగ్గర కంటికి కనిపించని కానుక అని వ్రాసుకుని శివయ్యను లోనికి పంపించాడు. శివయ్య విందు భోజనం చేసి తన గుడిసె చేరాడు.

మరునాడు మహారాణి వకుళాదేవి, యువరాణి జన్మదినాన ప్రజలు ఏం కానుకలు చదివించారోనని కుతూహలంగా జాబితాలు తెప్పించి తిరగేసింది. ఒక జాబితాలో శివయ్య అన్న పేరు దగ్గర కంటికి కనిపించని కానుక అని ఉండడం చూసి ఆశ్చర్యపోయింది. ఆ విషయం మహారాజు చెవిన వేసింది.

ఆకాశదీప్తుడు ఆ జాబితా తయారుచేసిన సేవకుడ్ని పిలిపించి వివరం అడిగాడు.

అప్పుడా సేవకుడు 'మహారాజా! ఆ శివయ్య ఎవడో మతిమాలిన వాడిలాగా

ఉన్నాడు. కానుక ఏం ఇవ్వకుండానే కంటికి కనిపించని కానుక అని వ్రాసుకోమన్నాడు. కానుక ఏదని అడిగితే అది కంటికి కనిపించదు' అని చెప్పాడు అని విన్నవించాడు.

ఆకాశదీప్తుడికి శివయ్య మతిమాలిన వాడిలా అనిపించలేదు.

అతడి అంతర్యం తెలుసుకోవడానికి భటులను పంపి శివయ్యను రప్పించాడు.

భటులు వెంటబెట్టుకు వచ్చిన శివయ్యతో, ఆకాశదీప్తుడు 'శివయ్యా! నీవిచ్చిన కంటికి కనిపించని కానుక వివరం తెలుసుకోవాలని నిన్ను ఇక్కడకు రప్పించాను' అని చెప్పాడు.

అప్పుడు శివయ్య 'మహారాజా! నేను చెప్పులు కుట్టుకు బ్రతికే నిరుపేదను. యువరాణి జన్మదినాన ఆ రోజు నాకొచ్చిన ఆదాయంతో ఏదైనా చిన్ని కానుక కొని తేవాలని అనుకున్నాను. అయితే ఆ రోజు చిల్లి గవ్వ ఆదాయం రాలేదు. ఆలోచిస్తే కంటికి కనిపించని కానుక గుర్తొచ్చింది. అందుకని అదే చదివించాను. అది మరేమిటో కాదు మహారాజా! నిండుమనసుతో యువరాణికి నేనిచ్చిన ఆశీర్వచనమే ఆ కంటికి కనిపించని కానుక' అని చెప్పాడు శివయ్య.

అది విన్న ఆకాశదీప్తుడు సంతోషంతో శివయ్యను కౌగిలించుకొని 'మణిమాణిక్యాల కంటే నిండు మనసుతో నీవిచ్చిన ఆశీర్వచనమే విలువైనది' అని చెప్పి శివయ్యకు విలువైన కానుకలు ఇవ్వబోయాడు.

అప్పుడు శివయ్య 'మహారాజా! ఎందరో ప్రముఖులు యువరాణికిచ్చిన మణిమాణిక్యాల కంటే నేనిచ్చిన ఆశీర్వచనం విలువైనదని మీరన్నారు.

అలానే మీరు ఇవ్వబోతున్న కానుకల కంటె మీరు నాపై చూపిన అభిమానం విలువైనది. అందుకే ఈ కానుకలు స్వీకరించలేను. నన్ను క్షమించండి' అని మహారాజు దగ్గర సెలవు తీసుకుని నిష్క్రమించాడు.

ఆ తరువాత మహారాజు ఆకాశదీప్తుడు నిరుపేద శివయ్యకు ఆర్థికంగా నిదొక్కుకోవడానికి ఉపాధి చూపించి తన అభిమానం చాటుకున్నాడు.





# నిజమైన సంతోషం

ఏణ్ణర్థం క్రితం పప్పూ తండ్రి కుటుంబ అవసరాల కోసం నగరంలోని ఒక వడ్డీ వ్యాపారి నుండి ఇరవై వేల రూపాయల రుణం తీసుకున్నాడు. ఆ వడ్డీవ్యాపారి కలప వ్యాపారం చేస్తూ ప్రజలకు రుణ రూపంలో డబ్బులు ఇచ్చేవాడు. ఎవరైనా గడువు ముగిసేలోగా బకాయిని చెల్లించకపోతే, 'చూడు.. మీ పొలంలో, చందనం చెట్లు ఉన్నాయి. నీవు తెలివైనవాడివే కదా. నేను చెప్పిన దాన్ని ఇప్పటికే గ్రహించి ఉంటావు. ఇప్పుడు చెప్పు, వాటికి నేనెంత చెల్లించాలి? ఆవిధంగా నీ రుణభారం కూడా తీర్చుకోవచ్చనుకుంటాను..' అని బేరం పెట్టేవాడు.

పప్పూ తండ్రి తీసుకున్న రుణం కూడా ఇలాగే కొండెక్కసాగింది. పెరిగి పెరిగి అది ఇప్పటికి ఇరవై అయిదు వేల రూపాయలకు చేరుకుంది. తీసుకున్న రుణం చెల్లించవలసిందిగా వడ్డీ వ్యాపారి అతడికి చాలాసార్లు గుర్తు చేశాడు. అయితే పప్పూ నాన్న ఆ మొత్తం చెల్లించలేకపోయాడు. అతడికి కొంత పొలం ఉంది. దాంతో అతడు కుటుంబ అవసరాలకోసం సాగు చేసేవాడు. అలాగే అతడి ఇంటి ముందు 150 సంవత్సరాల నాటి పెద్ద మర్రి చెట్టు ఉంది. ఈ చెట్టు కూడా పూర్వీకుల ఆస్తిలాగా తయారయింది. కొంత కాలం క్రితం వరద వెల్లువెత్తి అతడి పొలంలోని పంటను మొత్తంగా తుడిచిపెట్టేసింది. ఇలా జరగకపోయి ఉంటే అతడు చాలా సంతోషంగా ఉండేవాడు. ఈ ఏడు కూడా ఏపుగా పెరిగిన పంటను చూస్తూ అతడిలా ఆలోచించాడు. 'దేవుడు దయదలిస్తే పంట అమ్మిన తర్వాత నా రుణం మొత్తాన్ని ఒకే సారి చెల్లించివేస్తాను.' కాని జరగబోయేది ఎవరికీ తెలియదు కదా.

ఒక రోజు ఉదయం వడ్డీ వ్యాపారి బండి పప్పూ ఊరిలో ప్రవేశించింది. ఎగుడు దిగు

దర్శన్ సింగ్ ఆషత్

డుగా ఉండే దారి పొడవునా దుమ్ము రేపుకుంటూ అది పప్పూ ఇంటికి వచ్చింది.

వడ్డీ వ్యాపారిని చూడగానే, పప్పూ తండ్రి ప్రమాదాన్ని శంకించాడు. వడ్డీ వ్యాపారి క్రూరత్వం అతడికి బాగా తెలుసు. ఇరుగు పొరుగు వారికి వినపడేలాగా, తన రుణం తీర్చమంటూ అతడు గట్టిగా అరవకపోతే అదే పదివేలు అనుకున్నాడు.

కాని, వడ్డీవ్యాపారి మాత్రం పప్పూ నాన్నతో వడవడ మాట్లాడుతున్నాడు. 'నారాయణా, ఇప్పుడే నాకు రావలసిన డబ్బు చెల్లించు. నాకు డబ్బుతో అవసరం ఉన్నప్పటికీ నీ అవసరం కోసం దాన్ని నీకిచ్చాను. అయితే నీవు మాత్రం నా అప్పు బకాయి ఇంతవరకు చెల్లించలేదు.'

ఇలా మాట్లాడుతూ వడ్డీ వ్యాపారి అసలు విషయానికి వచ్చాడు. ఆ ఇంటి ముందు ఉన్న మర్రి చెట్టు వారిదని అతడికి ముందే తెలుసు. 'ఈ మర్రి చెట్టుని ఏం చేసుకుంటారు? దాన్ని నాకు ఇచ్చేయండి. మీ రుణం బకాయి తీరిపోతుంది. పైగా మరి దేనికీ మీరు గాభరా పడనవసరం ఉండదు.'

వడ్డీ వ్యాపారి నోట ఈ మాట వినగానే పప్పూ తండ్రి ఒక్కసారిగా ఆశ్చర్యానికి లోనయ్యాడు. ఆ మర్రిచెట్టును అమ్మడం అతనికి ఏమాత్రం ఇష్టం లేదు. కాని అతడేం చేయగలడు. పైగా తన పరువు పోయే ప్రమాదం కూడా ఉన్నదాయె.

పప్పూ తోటి విద్యార్థి అఖిల ఈ విషయం వినగానే, తానొక పెద్ద పర్వతం కింద కప్పబడిపోయినట్లు భావించింది. మర్రిచెట్టు లేకపోతే తామంతా ఎక్కడ ఊగులాడాలి మరి?



అఖిల ఈ విషయాన్ని ప్రీతికి చెప్పగానే ప్రీతి కూడా నమ్మలేకపోయింది. అఖిల ఊరకే చెణుకులేస్తోందని ఆమె భావించింది. 'అబద్ధాలు మాని నోరు మూసుకోవే. ఇంత పెద్ద చెట్టును పట్టుకుని కోసివేసే ఘనులెవ్వరు ఇక్కడ?'

గుర్నాథం ఊడలు పట్టుకుని ఊగేందుకు సమయం లేకపోతే చెట్టు ఎక్కేవాడు. అతడు కూడా ఈ విషయం విని బాధపడ్డాడు. పావురం గూట్లో పెట్టిన రెండు గుడ్ల మాటేమిటి?

మైనా గూట్లో పాటలు పాడుతున్న చిన్న గువ్వలున్నాయి. వాటి గతేమిటి మరి?

చెట్టుకు పట్టనున్న గతి తెలిసి పిల్లల్లో ప్రతి ఒక్కరూ విచారపడ్డారు. వాళ్ల హృదయాల్లో బాధ పేరుకుంది. మర్రిచెట్టుకు ఎలాంటి హానీ జరగకూడదని వారందరూ భావించారు. పిల్లలే కాదు పెద్దవాళ్లు కూడా



విచారపడ్డారు. ఎందుకంటే వారికీ ఆ చెట్టంటే ప్రాణం మరి. ఆ చెట్టుకింద ఆడుకునే వారు పెరిగి పెద్దయ్యారు కూడా.

మర్రిచెట్టుమీద నివసించే పక్షులు చెట్టు కింద పిల్లలు విచారంగా ఉండడం గమనించాయి. ఏదో కీడు జరగనుంది. ఏదో ఆపద ముంచుకొస్తున్నట్లుగా పక్షులు ఇప్పటికే అర్థం చేసుకున్నాయి కూడా.

'పిల్లల ముఖాలు ఎందుకలా నీరసంగా ఉన్నాయి. దేవుడు ఆగ్రహించాడా?' అని అడిగింది గోరింక.

దానికి ఉడుత, 'నేను కూడా మిమ్మల్ని ఈ విషయం అడగాలనుకున్నాను. ఏదో తెలియని ఆందోళనతో నా గుండె కొట్టుకుంటోంది.'

ఉన్నట్లుండి వడ్డీ వ్యాపారి బండి అక్కడికి వస్తుండటం కనిపించింది. అది సరిగ్గా పప్పూ ఇంటి ముందు ఆగింది. దాంట్లోంచి కొంతమంది దిగారు. వారి చేతుల్లో గొడ్డళ్ళు, రంపాలు కూడా ఉన్నాయి.

పప్పూ నాన్న వడ్డీవ్యాపారి ముందు నిలుచున్నాడు. అతడి ముఖం వాడిపోయింది. అతడు మతిలో లేనట్లు కనబడుతున్నాడు. క్షణాల్లోపే, మర్రిచెట్టును కోత వేయడానికి వడ్డీవ్యాపారి వచ్చినట్లు వార్త సుడిగాలిలా పాకిపోయింది. ఈ మాట వినగానే పిల్లలు నమ్మలేనట్లుగా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

పప్పూకి బిల్లూ అనే స్నేహితుడున్నాడు. అతడు పప్పూ కంటే రెండేళ్ల పెద్దవాడు. అతడు కాస్త చురుకైనవాడు కూడా. ఉన్నట్లుండి అతడి మనసులో ఒక ఆలోచన తట్టి స్నేహితులతో చెప్పాడు. అదన్నమాట విషయం. పిల్లలందరికీ తెలిసిపోయింది.

వడ్డీవ్యాపారి ఆ మర్రిచెట్టును కోయవలసిందిగా తన మనుషులను ఆదేశించడానికి ముందే ఫణి, రవి, నరేంద్ర, వెంకీ, తిరుమాల్, బాలా, లలిత, యమున, వాసుకి, మహేష్, శశి, శివకుమార్, రాజు ఇంకా అనేకమంది పిల్లలు తమ హుండీలతో పాటు వచ్చి తాము దాచుకున్నదంతా బిల్లూ పరచిన బట్టపై పోశారు.

కుర్చీలో కూర్చుని ఉన్న వడ్డీ వ్యాపారి జరుగుతున్న తతంగాన్ని మొత్తంగా చూస్తున్నాడు. కొంతమంది హుండీలలో అయిదు రూపాయలే ఉండగా కొంతమంది హుండీలలో యాభై రూపాయలవరకు ఉన్నాయి. కొంతమంది దగ్గర వందరూపాయల వరకు ఉండగా మరికొందరి దగ్గర అంతకుమిం

చిన డబ్బుంది. అతడు చూస్తుండగానే 3వేల రూపాయల డబ్బు పోగయింది.

'పిల్లలూ ఇది చాలా తక్కువ డబ్బురా. ఇది నాకెందుకూ పనికిరాదు,' చెప్పాడు వడ్డీవ్యాపారి.

'మామయ్యా, ఈ మర్రిచెట్టును మాత్రం కోతకు వేయకు. నీకు మాటిస్తున్నాము. మేం ప్రతినెలా డబ్బు వసూలు చేసి క్రమం తప్ప కుండా నీకు ఇస్తాము.' అని బిల్లూ చెబుతూ తన వద్ద పోగుపడిన డబ్బును వడ్డీ వ్యాపారికి ఇచ్చాడు.

పిల్లలందరూ చేతులు జోడించి అతడి ముందు నిలుచున్నారు.

పిల్లల ముఖ భంగిమలను, వారి ముకుళిత హస్తాలను చూసి వడ్డీ వ్యాపారి హృదయం ద్రవించింది. కాస్సేపు ఆలోచించి అతడు తన చేతిని పప్పూ నాన్న భుజంపై వేసి, 'ఈ పిల్లల ముఖాల్లోని ప్రేమానురాగాలను చూస్తూంటే మర్రి చెట్టును కొయ్యాలనిపించడం లేదు. వారు తమ పరిసరాలను ఎంతగానో ప్రేమిస్తున్నారు. దేవుడు మిమ్మల్ని కరుణించుగాక! మీకు మంచి భవిష్యత్తు ఏర్పడుగాక. నా బాకీని నీవే తీర్చు. నీకు ఎంత అనిపిస్తే అంతే వడ్డీని ఇవ్వు. వడ్డీ ఇవ్వలేను అంటే కూడా ఫరవాలేదు.'

పప్పూ నాన్న కూడా వారితో పాటు చేతులు ముడుచుకునే ఉన్నాడు.

తేనీరు తాగిన తర్వాత వడ్డీ వ్యాపారి బయలుదేరిపోవడానికి తన బండిలో కూర్చోగానే, మర్రిచెట్టుపైనుండి పక్షుల కిలకిలారావాలను అతడు విన్నాడు. ఉడతలు కిచకిచమంటూ ఒక కొమ్మ నుండి మరొక కొమ్మమీదికి ఎగురుతూ సంతోషం పట్టలేకపోతున్నాయి.

పక్షులు పాట పాడుతూ తనకు కృతజ్ఞతలు చెబుతున్నట్లు వడ్డీవ్యాపారి తలిచాడు. తర్వాత పప్పూ నాన్న పిల్లలతో మాట్లాడుతూ, 'పిల్లలూ, మర్రి చెట్టును నిజంగా మీరే కాపాడారు. మీ రుణం ఎన్నటికీ తీర్చుకోలేను.'

పిల్లలంతా మర్రిచెట్టుకిందికి చేరి గంతులేయసాగారు. మర్రిచెట్టు తలెత్తుకుని నిలబడి ప్రశాంతంగా చూస్తూ మందహాసం చేయసాగింది.





# పంచతంత్ర కథలు

దుష్టబుద్ధి తన నూరుబంగారు కాసులనూ త్వరలోనే ఖర్చు చేసుకుని, డబ్బు కోసం తహతహలాడుతూ ధర్మబుద్ధి వద్దకు వెళ్ళి, అతన్ని వెంటబెట్టుకుని డబ్బుదాచిన చోటికి వెళ్ళాడు. ఇద్దరూ మళ్ళీ చెరొక నూరు కాసులూ తీసుకున్నారు. కాని సంవత్సరం తిరిగే లోపల దుష్టబుద్ధి ఆ డబ్బంతా తన దుర్వ్యసనాలకు ఎడా పెడా ఖర్చుచేసేశాడు.

దుష్టబుద్ధి ఉద్దేశం ఇలా ఒకటి రెండు సార్లు ఆ డబ్బును ధర్మబుద్ధితో పాటు తీసుకుని, అతనికి నమ్మకం కలగనిచ్చి, అంతా తానే కాజేయాలని, ఇప్పుడు దాచిన చోట ఇంకా ఆరువందల కాసులు మిగిలి ఉన్నాయి. అదంతా తానే సంగ్రహించాలనే ఉద్దేశంతో అతను అర్ధరాత్రి వేళ డబ్బు దాచిన చోటికి వెళ్ళి, పాత్ర నుంచి ఆరు వందల బంగారు కాసులూ తీసుకుని, పాత్రకు మళ్ళీ మూతి కట్టి, దాన్ని ఎప్పటి లాగే పాతిపెట్టి, ఇంటికి వచ్చేశాడు.

ఒక నెల గడవనిచ్చి, అతను ధర్మబుద్ధి వద్దకు వెళ్ళి, 'మిత్రమా, మిగిలిన డబ్బు కూడా పంచేసుకుందామా? కాస్త డబ్బు అవసరంలో ఉన్నాను,' అన్నాడు. ధర్మబుద్ధి సరే అన్నాడు.

ఇద్దరూ డబ్బు దాచిన చోటుకి వెళ్ళారు. పాత్రను తవ్వి తీసి చూస్తే అందులో ఏమీ లేదు. దుష్టబుద్ధి ఆ పాత్రతో తన తల బాదుకుని, 'అయ్యో, ధర్మబుద్ధీ! డబ్బంతా కాజేశావా? నా వంతు నాకిస్తే ఇచ్చావు, లేకపోతే ఇప్పుడే పోయి న్యాయ స్థానంలో నీ మీద వ్యాజ్యం తెస్తాను,' అన్నాడు.

'ఛీ, బుద్ధిహీనుడా! నేను అలా దొంగ

మిత్రభేదం-27

తనానికి పాల్పడే నీచుణ్ణి కాను,' అన్నాడు ధర్మబుద్ధి చీత్కరిస్తు.

ఇద్దరూ పోట్లాడుకుని, న్యాయస్థానానికి వెళ్ళి ఒకరిపై ఒకరు ఫిర్యాదు చేసుకున్నారు.

ఇద్దరి పక్షానా సాక్షులెవరూ లేని కారణం చేత న్యాయాధికార్లు వెంటనే తీర్పు చెప్పలేక, ఇద్దరినీ ఐదు రోజుల పాటు నిర్బంధంలో ఉంచారు.

ఆరవనాడు న్యాయాధికార్లు ఇద్దరినీ అగ్నిపరీక్షకు గురిచేస్తామన్నారు. దుష్టబుద్ధి ఇందుకు ఆక్షేపణ చెబుతూ, 'ఇది ధర్మం కాదు. పత్రాలూ, సాక్షులూ లేని పరిస్థితిలోనే అగ్ని పరీక్ష విధించాలని ధర్మ శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ సందర్భంలో మేము ధనం దాచిన చోట వృక్షదేవత సాక్ష్యం ఇయ్యగలదు. మాలో ఎవరు దోషి అయినదీ ఆ వృక్షదేవత చెబుతుంది. ఆ సాక్ష్యం విని తమరు తీర్పును ఇయ్యవచ్చు,' అన్నాడు.

న్యాయాధికార్లు ఇందుకు సమ్మతించి, మర్నాడు వాళ్లను వెంటబెట్టుకుని చెట్టు వద్దకు వెళ్లి, వృక్షదేవత సాక్ష్యం వినటానికి నిర్ణయించి, ఇద్దరినీ తగిన హామీ మీద వదిలిపెట్టారు.

దుష్టబుద్ధి తిన్నగా ఇంటికి వెళ్ళి, తన తండ్రితో 'నాన్నా, సొమ్ము నేనే తీశాను. నీవు ఒక్కమాట అనగలిగితే అదంతా మనకే ఉంటుంది. ఇవాళ రాత్రి నిన్ను చెట్టు దగ్గరికి తీసుకుపోతాను. నువ్వు చెట్టు తొర్రలో దాక్కుని, రేపు న్యాయాధికారులు వచ్చి, డబ్బు ఎవరు తీశారని అడిగినప్పుడు



ధర్మబుద్ధే తీశాడని చెప్పాలి,' అన్నాడు.

దానికి అతడి తండ్రి, 'ఒరే బాబూ, ఇలాటి దుష్టపథకాల వల్ల ఇద్దరమూ నాశనమవుతాము. వివేకం కలిగిన వాడు ఏ పథకం వేసినా అందులోని లోపాలు ఎలాంటివో అని జాగ్రత్తగా ఆలోచించాలి. లేకపోతే కొక్కిరాయి గతి అవుతుంది.' అన్నాడు.

'కొక్కిరాయికి ఏమయింది?' అన్నాడు దుష్టబుద్ధి.

తండ్రి కొక్కిరాయి కథ ఇలా చెప్పాడు:

ఒక అరణ్యంలో ఒక మర్రిచెట్టు తొర్రలో కొక్కి రాయి దంపతులు నివసిస్తుండేవి. దాని దిగువన బొరియలో ఒక నాగుబాము ఉండేది. ఈ పాము చెట్టు తొర్రలోకి ఎక్కి, రెక్కలు రాని ఒక కొక్కిరాయి పిల్లను మింగేసి వెళ్ళిపోయింది.

అది చూసిన కొక్కిరాయి చెరువుగట్టున కూర్చుని ఏడుస్తూండగా, ఒక పీత చూసి, 'ఎందుకు మామా ఏడుస్తున్నావు,' అని అడిగింది.

'పాపిష్టి పాము మా చెట్టుకింద బొరియలో ఉంటున్నది. అది ఇవాళ నా పిల్లను ఒకదాన్ని తిన్నది. రేపు మిగిలిన పిల్లల గతి ఇంతే అవుతుంది. ఏడవక ఏం చెయ్యమంటావు?' అన్నది కొక్కిరాయి.

తన శత్రువైన కొక్కిరాయిని నాశనం చేయాలన్న దురుద్దేశంతో పీత, 'చూడు మామా, ముంగిస ఉండే బొరియ నుంచి పాము బొరియ దాకా చేపముక్కలను వెయ్యి. ముంగిస వాటిని తింటూ వచ్చి, పామును చంపుతుంది.' అని ఉపాయం చెప్పింది.

అందులో కీడు ఆలోచించక, బుద్ధిలేని కొక్కిరాయి అలాగే చేసింది. ముంగిస వచ్చి పామునైతే చంపింది, కాని చెట్టుతొర్రలో ఉన్న మిగిలిన కొక్కిరాయి పిల్లలను కూడా చంపి వెళ్ళిపోయింది. *(ఇంకా వుంది)*





# ఫలించిన ప్రయోగం

తల్లితండ్రులు ఒకరి తరువాత ఒకరు వేరు వేరు కారణాలతో మరణించడం వల్లనూ, మేనమామ మొదట ఆదరించినా ఎక్కువ కాలం పోషించలేక ఏదో ఒక సాకుతో కొట్టి ఇంట్లోంచి వెళ్లగొట్టడం మూలంగానూ విశాఖుడనే కుర్రవాడు వీధిన బడ్డాడు. విశాఖుడు ఎవరైనా దయతలిచి, పెట్టింది తింటూ ఆ రోజుకి ఆకలి తీర్చుకునేవాడు. ఒకరోజు వాడినెవరూ కనికరించలేదు. సూర్యుడు పైకెక్కేకొద్దీ ఆకలి మంట వాడిని దహించి వేయసాగింది.

ఇంతలో నడివయస్సు ఉన్న ఓ ఆసామి కిరాణా కొట్టులో వందరూపాయల నోటిచ్చి ఏదో కొని చిల్లర నోట్లు పక్కజేబులో వేసుకోవడం విశాఖుణ్ణి ఆకర్షించింది. ఆ డబ్బు ఎలాగైనా కొట్టేయాలని విశాఖుడు ఆ వ్యక్తి వెంటబడ్డాడు. అంతకుముందు తనకు తోడు కలిసిన వీధి బాలుడొకడు ఒడుపుగా జేబు దొంగతనం చేయడం విశాఖుడు చూశాడు.

వాడిని అనుసరిస్తూ రద్దీగా ఉన్న కూడలిలోకి రాగానే వెనుకనుంచి ఆ ఆసామి జేబులో చెయ్యి పెట్టి విశాఖుడు నోట్లు అందుకోబోయాడు.

అంతే! క్షణంలో అప్రమత్తుడైన ఆ వ్యక్తి చటుక్కున వాడి చెయ్యి పట్టుకున్నాడు.

ఈ హఠాత్పరిణామానికి వాడు బిత్తర పోయాడు. ఆ వ్యక్తి జనాన్ని పిలిచి అల్లరి చేస్తాడని, తనకిక చావుదెబ్బలు తప్పవని అనుకుంటూ విశాఖుడు గజగజ వణికిపోసాగాడు. కానీ ఆ వ్యక్తి అలాంటిదేం చేయలేదు.

ఆయన పేరు కేశవయ్య. విశాఖుడితో, 'నాయనా, నీకు తల్లిదండ్రులు ఉన్నారా,

గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడ్



లేదా? ఈ చిన్న వయస్సులో ఈ పాడుపని ఎందుకు చేస్తున్నావు?' అంటూ ప్రశ్నించాడు.

విశాఖుడు తన దీనగాథను చెప్పుకుని, 'అయ్యా, మీరు చాలా మంచివారని నాకనిపిస్తోంది. రెండు రూపాయలిస్తే నాకీ పూట గడుస్తుంది.' అన్నాడు.

'నేను నీకు రెండు రూపాయలివ్వగలను. అది నాకు పెద్ద సంగతి కాదు. కానీ నువ్వు ఇలా అడుక్కోవడం మొదలు పెడితే నీకిదే అలవాటు అవుతుంది. నా వెంటరా. నీకు కడుపు నిండా తిండి పెట్టిస్తాను,' అంటూ కేశవయ్య వాడిని ఓ ఖరీదయిన హోటల్‌కి తీసుకెళ్లాడు.

'చూడు బాబు, ఒక్కసారి దొంగతనం చేస్తూ పట్టుబడ్డావంటే సమాజం నీకు 'దొంగ అన్న ముద్ర వేస్తుంది. ఒక్కోసారి చేయని నేరానికి కూడా నింద మోయాల్సి వస్తుంది. జనం పసివాడన్న కనికరం కూడా లేకుండా నిన్ను గొడ్డును బాదినట్లు బాదుతారు. నామాట విని నువ్వు దొంగతనాల జోలికి వెళ్లవద్దు. ఏదైనా పని చేసుకో,' అంటూ హితబోధ చేశాడు.

ఇలా కబుర్లు చెప్పుకుంటూ హోటల్లో వారిద్దరూ రకరకాల ఆహార పదార్థాలు తెప్పించుకొని పుష్టిగా తిన్నారు. తరువాత కేశవయ్య చెయ్యి కడుక్కువస్తానని వెళ్లాడు అంతే! ఆ తరువాత అతడి జాడలేదు. అతడు హోటల్ వాళ్లతో విశాఖుడు తన కొడుకనీ తిన్నదానికి డబ్బంతా వాడే ఇస్తాడని చెప్పి తప్పించుకున్నాడట.

ఆ ఆసామి డబ్బు ఖర్చు కాకుండా పుష్టిగా తిని వెళ్లడానికి, మోసంతో తనని ఉపయోగించుకున్నాడని విశాఖుడికి అర్థమైంది.

తన వద్ద డబ్బు లేదని చెప్పడంతో ఆ హోటల్ యజమాని దుర్గయ్య మండిపడ్డాడు. 'నా హోటల్లో పదిరోజులు పనిచేసి నా బాకీ తీర్చు!' అంటూ గదమాయించాడు.

ఇక తప్పనిసరి పరిస్థితుల్లో వంట పాత్రలు తోమడం, కుర్చీలు, బల్లలను శుభ్రం చేయడం వంటి పనులు పది రోజులపాటు కష్టపడి పనిచేశాడు. పని మొదట్లో కష్టమనిపించినా తరువాత అలవాటైంది. ఈ పదిరోజుల్లోనూ వాడు ఒక

గొప్ప సత్యాన్ని గుర్తించాడు. కష్టపడి పని చేస్తే ఆకలి బాధ ఉండదని. అందుకే అక్కడి నుండి వెళ్లిపోకుండా ఆ హోటల్ లోనే పనివాడిగా కొనసాగాడు.

విశాఖుడు నిజాయితీగా ఉంటూ యజమాని నమ్మకం సంపాదించాడు. పది సంవత్సరాల వ్యవధిలో యజమానితో అవసరం లేకుండా హోటలు నడిపే మేనేజరయ్యాడు. హోటలు బాగా లాభాలనార్జించింది. విశాఖుడికి జీతం పెరగడంతో డబ్బు కూడబెట్టి స్వంత ఇల్లు కట్టుకున్నాడు. నచ్చిన అమ్మాయిని వివాహం చేసుకుని సుఖంగా కాపురం చేసుకుంటున్నాడు.

అయితే విశాఖుడికి తెలియని రహస్యం ఒకటుంది. కేశవయ్య మోసగాడు కాదు.

దొంగగా మారిపోయే స్థితిలో ఉన్న కేశవుడి చేత కొద్ది రోజులు బలవంతంగా పని చేయించగలిగితే పనివిలువ తెలిసి మంచి దారిలోకి రాగలడని కేశవయ్య అంచనా వేశాడు. విశాఖుడు, కేశవయ్య హోటల్‌లో తిన్నదానికి డబ్బు చెల్లించలేదనేది ఒట్టిదే. విశాఖుణ్ణి మంచిదారిలోకి తీసుకురావడానికి కేశవయ్య హోటల్ యజమానిని ఒప్పించి ఇరువురూ కలిసి ఆడిన నాటకం అది. కేశవయ్య తిన్నదానికి డబ్బు చెల్లించడమే కాదు, విశాఖుడికి బట్టలు కుట్టించడానికి కొంత డబ్బు కూడా ఇచ్చి వెళ్లాడు.

కేశవయ్య చేసిన ప్రయోగం ఫలించి విశాఖుడు ప్రయోజకుడయ్యాడు.

ఒకరోజు కేశవయ్య తిరిగి వచ్చి హోటల్ యజమానిని ఓ గదిలోకి తీసుకెళ్ళి ఏదో మాట్లాడుతుండటం విశాఖుడు చూశాడు. వాడికి కేశవయ్యపై మండిపోయింది. చాటు నుండి వారి సంభాషణల్లో అసలు నిజం తెలుసుకుని ఆశ్చర్యపోయాడు. తరువాత ఆనందంతో కేశవయ్య కాళ్ళమీద పడి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

చిన్నవయసులో పసివాళ్లు చెడుదారి వైపు మళ్లకుండా చూసుకుంటే వారి భవిష్యత్తు మంచి బాటలో పయనిస్తుంది.





# తాజెడ్డకోతి...

పూర్వం ఒక గ్రామంలో ఒక గురువు వద్ద అనేకమంది శిష్యులు శిష్యరికం చేస్తుం డేవారు. ఒకనాడు గురువుగారింట్లో వంట చెరుకు అయిపోయింది. అందుచేత శిష్యు లందరూ ఎండుకట్టెలు ఏరుకురావటా నికి దగ్గర్లో ఉన్న అడవికి వెళ్లారు.

ఈ శిష్యులలో ఒకడు వట్టి సోమరి పోతు. వాడు తప్పనిసరి అయితేనేగాని పని చేసేవాడు కాడు. ఒకవేళ పని చేయ వలిసి వచ్చినా సాధ్యమైనంత తక్కువగానే చేసేవాడు.

శిష్యులు చాలామంది ఉన్నారు కనుక ఈ సోమరిపోతు ఎంత పనిచేసినదీ ఎవరికీ తెలిసేది కాదు.

దానికితోడు వాడు తెలివైన వాడు కనుక, తనకున్న సోమరితనం బయటపడకుండా ఎంతో జాగర్త పడుతుండేవాడు. అడివిలో ప్రవేశించిన శిష్యులంతా ఎండుకట్టెల కోసం అంతటా వెతుకుతూ, పనికివచ్చే కట్టెలూ, పుల్లలూ ఏరి ఒకచోట పోగువేస్తూ పనిలో నిమగ్నులయారు. సోమరిపోతుకు ఇదంతా వృధా శ్రమ అనిపించింది. వాడు మిగిలిన వాళ్లకి ఎడంగా వెళ్లాడు. ఎక్కడైనా ఎండిపోయిన చెట్టు కనిపిస్తుందేమోనని వాడి ఆశ. వాడు కొంత దూరం వెళ్లాక వాడికి కావలిసిన చెట్టు దొరకనే దొరికింది. ఆ చెట్టున ఒక్క ఆకు కూడా లేదు. చెట్టు బెరడంతా నల్లగా ఉంది. అది ఎండు చెట్టే అనుకున్నాడు సోమరిపోతు.

ఈ ఒక్క చెట్టు విరిచి పట్టుకుపోతే చాలు, ఎంతకాలమైనా పనికివస్తుంది! అనుకుని సోమరిపోతు మంచి నీడ చూసు కుని నిద్రపోయాడు. వాడికి నిద్రపట్టే సమయానికి మిగిలిన శిష్యుల మాటలూ,

ఆర్. ఇందుమతి

నవ్వులూ వినిపిస్తూనే ఉన్నాయి. కాని తీరా వాడు నిద్రలేచే సమయానికి చుట్టూ అంతా నిశ్శబ్దంగా ఉంది. పొద్దు కూడా చాలావరకు వాలిపోయింది. దీంతో సోమరి పోతుకు కంగారెత్తింది. తన తోటి శిష్యులు వంటచెరుకు మోపులు కట్టుకుని వెళ్లి పోయారని వాడు గ్రహించాడు. ఎదురుగా కనబడే మొండిచెట్టు కొమ్మలు గబగబా విరిచి, ఇంత మోపు కట్టి నెత్తిన పెట్టుకుని గురువుగారి ఇల్లు చేరేసరికి అంతకు ముందే మిగిలిన వాళ్లు ఇల్లు చేరటమూ, తమ కట్టెలన్నీ ఒక కుప్పగా వెయ్యటమూ కూడా అయింది.

సోమరిపోతు రొజుకుంటూ వచ్చి వాళ్లు వేసిన మోపుల మీద తాను తెచ్చిన కట్టెల మోపు విప్పి పరిచాడు. అంతా సవ్యంగానే జరిగిపోయింది కదా అని వాడు చాలా సంతోషించాడు.

ఆ రాత్రి గురువుగారు తన శిష్యులంద రితో, 'ఒరే, పలాని గ్రామంలో రేపు సంత ర్పణ చేస్తున్నారు. మనకందరికీ పిలుపు వచ్చింది. నాకు వేరే పని ఉంది. కాని మీరంతా తెల్లవారక ముందే ఇంత అన్నం తిని బయలుదేరండి. మధ్యాహ్నానికల్లా సంతర్పణకు అందుకుంటారు!' అని అన్నాడు. శిష్యులంతా సంతోషించారు.

తెల్లవారుజామునే గురువుగారి భార్య శిష్యుల కోసం వంట చేద్దామనుకుని, కిందటి సాయంత్రం వాళ్లు తెచ్చివేసిన కుప్పమీది నుంచి కట్టెలు తీసుకుపోయి, పొయి రాజేసింది. అయితే అవన్నీ పచ్చి కట్టెలు... సోమరిపోతు తెచ్చినవి. అందు చేత ఏ వేళకూ పొయి రాజలేదు. అన్నం ఉడికే సరికి సూర్యోదయం కూడా అయి పోయింది. శిష్యులు సకాలంలో అన్నం తినలేక, ప్రయాణమై సంతర్పణకు వెళ్ల లేక పోయారు. తాజెడ్డ కోతి వనమెల్ల చెరి చిందన్నట్లు ఒక్క సోమరిపోతు మూలంగా, శిష్యులందరికీ సంతర్పణ లేకుండాపోయి ఆశాభంగమయింది.





# సేవాభావం

తమ కుమార్తె పెళ్ళి గురించి ముకుందుడిని అతడి భార్య పార్వతి శత పోరుతున్నది. ఆమెకు ఒక మేనల్లుడున్నాడు. అతడిది వ్యవసాయ కుటుంబం. అయినప్పటికీ అతడి తండ్రి, పార్వతి పెద్దన్నయ్య వాడికి మల్లయుద్ధ విద్య నేర్పించాడు. వాడు రాజుగారి కొలువులో ప్రతి ఏటా కొన్ని ప్రదర్శనలిచ్చి, రాజుగారిచేత పతకాలు బహుమతిగా కూడా పొందాడు.

'నా మాట విని మీరు మా అన్నయ్యను కలిసి మాట్లాడండి. ఆడపిల్లకు తగిన వయస్సులోనే పెళ్లి చేసి అత్తవారింటికి పంపితే దక్కే ఆ గౌరవమే వేరు,' అంది పార్వతి.

ముకుందుడు అవుననలేదు. కాదనలేదు. అట్టే అతడికి తన మేనల్లుడైన రాముడి మీద ఎలాంటి సదభిప్రాయం లేదు. రాముడు పేరున్న మల్లయోధుడైతే అయ్యాడు గాక, వాడికి మరో బతుకు తెరువు తెలియలేదు. తండ్రితో పాటు పోయి వ్యవసాయం చెయ్యడు.

'రాముడు మన అమ్మాయిని ఎలా పోషించగలడు?' అని అడిగాడు ముకుందుడు.

పార్వతి తన మేనల్లుడి ప్రస్తావన వస్తే చాలు పరవశించిపోతుంది. అదే పరవశంతో, 'వాడికేం లోటండి? వాడికి రాజుగారి ప్రాపకం ఉంది. ఏటేటా ఉత్సవాల్లో వాడికి బంగారు పతకాలు లభిస్తున్నాయి. అతడి కంటే ప్రతిభావంతుడు మన కుటుంబాల్లో మరొకడు దొరుకుతాడా?' అంది.

ముకుందుడికి తన భార్యకెలా తెలియ చెప్పాలో అర్థం కాలేదు.

'ప్రతి ఏటా పతకాలు సాధించడమే

---

ఎం.వి.వి. సత్యనారాయణ

బతుకు తెరువా? ఏడాదంతా ఏం చేస్తాడు? అభ్యాసమా? తన కుటుంబానికి అన్న వస్త్రాలు ఎలా సంపాదించుకుంటాడు?'

'రాముడితో సంబంధం చెయ్యకపోతే మరి పుట్టింటి వారి గడప ఎలా తొక్కగలను? మావాళ్లు మన అమ్మాయిమీదే ఆశలు పెట్టుకున్నారు,' అంది పార్వతి.

'తన బావను పెళ్లాడటం మన అమ్మాయికి నచ్చిందో లేదో తెలుసుకున్నావా?' అడిగాడు ముకుందుడు. అతడికి లోపల్లోపల దహించుకుపోతోంది.

పార్వతి అతడి సందేహాన్ని గడ్డిపరక తీరులో విదిల్చిపారేసింది. మీకు అటువంటి సందేహం అక్కర్లేదని, రాముడిని వేరే ఒకరెవరో తన్నుకు పోయే ప్రమాదం ఉందని వెంటనే బయలుదేరి వెళ్ళమని హెచ్చరించింది.

ముకుందుడు ఇక చేసేది ఏమీ లేక ఆరోజే తన బావగారి ఊరు బయలుదేరిపోయాడు.

గ్రామం పొలిమేరలు చేరేసరికి అతడు ఎండదెబ్బకు తాళలేక ఒక చెట్టు నీడలో ఆగిపోయాడు. చెట్టు కింద రెండు పెద్ద పెద్ద బానలతో మంచి నీళ్లు, తాగడానికి రెండు తాటాకు పాయలు కనిపించాయి.

ముకుందుడు నీరుతాగి సేదతీరాడు.

కొంతసేపు నీడ పట్టున విశ్రమించాడు. అంతటి ఎండలోనూ కావిడిలో రెండు బిందెల నీళ్లు ఒకడు మోసుకొచ్చి ఎప్పటికప్పుడు బానలు నింపుతూ ఉన్నాడు.



అతడు కూడా రాముడి వయస్సు ఉన్న యువకుడే! ఎండలో తిరిగి తిరిగి అతడు నల్లబడ్డాడు.

'ఎవరు నాయనా నువ్వు?' అడిగాడు ముకుందుడు.

ఆ యువకుడు వినయంగా నమస్కరించి, 'ఈ గ్రామంలో వ్యవసాయం చేసుకుని జీవిస్తున్నాను. మా గ్రామానికి వచ్చే బాటసారులు దాహంతో బాధపడకూడదని వారికి మంచి నీరును ఈ విధంగా అందిస్తున్నాను,' అన్నాడు.

ముకుందుడు అతడిని కావలించుకుని, 'చాలా గొప్ప పని చేస్తున్నావు. ఈ సమయానికి మంచి నీరే లేకపోతే నేను అనారోగ్యంతో పడిపోయేవాడిని. నా ప్రాణాలను కాపాడావు,' అన్నాడు.

ఈ పని చేస్తున్నందుకు ఆ యువకుడికి ఏ ప్రతిఫలమూ రాదని గ్రహించాడు ముకుందుడు. అతడు తన వద్ద నుంచి ఎలాంటి మెప్పునూ ఆశించలేదు కూడా.

ఆ సమయంలో ముకుందుడు అతడి వివరాలను అడిగి తెలుసుకున్నాడు. వ్యవసాయం మీద వచ్చే రాబడితోనే తృప్తిగా, తన తల్లిదండ్రులతో సంతోషంగా బతుకుతున్నానని చెప్పాడు ఆ యువకుడు.

సేదతీరిన తర్వాత ప్రయాణమై తన బావగారింటికి చేరుకున్నాడు. తన బావగారింట అందరూ బక్కచిక్కి ఉన్నారు. ఎవరి మొహాల్లోనూ కళాకాంతులు లేవు. ఇంటి పెరట్లో మాత్రం రాముడు తన కండలతో నిగనిగలాడుతూ తీరిక లేకుండా వ్యాయామం చేస్తున్నాడు.

తన బావగారింట అందరూ ఎందువల్ల నీరసంగా ఉన్నారో తెలుసుకోదలిచాడు ముకుందుడు. అతడి బావ ముకుందుడి వైపు నీరసంగా చూసి, 'మా అందరి సంపాదనా వాడి తిండికే సరిపోతోంది. ఈ ఏడాది ప్రదర్శనల్లో పాల్గొనవలసిందిగా రాజుగారు కబురు పంపారు. మేమంతా అర్ధాకలితో ఉంటే కాని వాడి పోషణ సాగడం లేదు,' అన్నాడు.

ముకుందుడు ఇక ఆ ఇంట రాత్రికి బస చెయ్యలేదు. తన బావ కూడా రాత్రికి ఉండిపొమ్మని పట్టుబట్టనూ లేదు.

బాటసారులకు మంచినీరు అందించే యువకుడి ఇంట ఆరాత్రి బస చేశాడు ముకుందుడు. అతడి కుటుంబం ముకుందుడిని ఎంతో ఆత్మీయతతో ఆదరించింది. తమకున్న దానితో తృప్తిగా బతికే కుటుంబం అని ముకుందుడు గ్రహించాడు.

అతడు వారివద్ద సెలవు తీసుకుని తమ గ్రామం చేరుకున్నాడు.

ఆ యువకుడికే తన కూతురునిచ్చి పెళ్లి చేయాలని ముకుందుడు నిర్ణయించాడు. పార్వతి తన భర్త నిర్ణయాన్ని ఈసారి గౌరవించింది.





# నిజమైన మాట

అక్బర్ చక్రవర్తి ఆస్థానంలో వీరబల్ విదూషకుడుగాను, ఆంతరంగికుడు గాను ఉండేవాడు. తాన్సేన్ సంగీత విద్వాంసుడు. తాన్సేన్ పాట వినడానికి దేశదేశాలనుండి ప్రముఖులు వచ్చేవారు.

ఈ ప్రజ్ఞకు తాన్సేన్ అతిశయపడలేదు. కాని, మిగిలిన ముసల్మానులకు, తాన్సేనుకు సమానుడు లేడని గర్వం పట్టుకున్నది. అంతే కాదు. చక్రవర్తికి అభిమానుడైన వీరబల్‌ను తప్పించి, ఆ స్థానంలో తాన్సేన్‌ను నియమించడం తగునని సూచనలు చేస్తూ వచ్చారు.

ఈ మాటలను గ్రహించిన చక్రవర్తి ఈ ప్రస్తావనను సహించలేక 'మీరెంత చెప్పినా, వీరబలుడంతటి వాడు జన్మజన్మలకూ మరొకడు కానేరడు,' అని జవాబు చెప్పాడు.

అప్పటికేమీ అనలేక ముసల్మానులు కొన్నాళ్ల తర్వాత ఒకనాడు సభ ఏర్పాటు చేశారు. చక్రవర్తిని కూడా ఆహ్వానించారు.

ఆనాడు చాలా వేడిగా, ఉక్కగా ఉన్నది. ప్రమిదలలో చమురు, వత్తి వేసి ఊరకున్నారు గాని, చీకటిపడినా ముసల్మానులు వెలిగించ లేదు.

తాన్సేను దీపకరాగం పాడేసరికి, దీపాలన్నీ వాటంతటవే వెలిగినై. మేఘమల్హార్ రాగం పాడాడు. వెంటనే ఉక్కపోయి వర్షం కురిసింది.

ఇందుకు చక్రవర్తి వింతపడటం గమనించిన ఒక ముసల్మాను వృద్ధ వ్యక్తి, 'ప్రభూ! ఇప్పుడు బోధపడిందా? వీరబలుడికి ఇటువంటి ప్రజ్ఞలెక్కడివి? అందుకనే మంత్రిపదవికి తాన్సేన్ తగినవాడని లోకం

పి.నాగేశ్వరరావు




ఘోషిస్తున్నది,' అని చాకచక్యంతో మనవి చేశాడు.

అందుకు అక్బరు 'తాన్సేన్ గొప్ప విద్వాంసుడే కావచ్చు. కాని వీరబలుని సరిపోలడు. కావాలంటే ప్రత్యక్షంగా రుజువు చేస్తాను,' అని ఖచ్చితంగా చెప్పాడు.

రోజుల్లోనే అక్బరు చక్రవర్తి అవా దేశపు రాజుకు జాబొకటి రాశాడు. ఆ ఉత్తరానికి ముద్రలు వేసి, వీరబలుణ్ణి తాన్సేన్‌నీ పిలిచి, 'మీరీ జాబు పట్టుకుని అవా దేశపు రాజు వద్దకు పోవాలి. చాలా అవసరమైన పని. ఈ పని మీరిద్దరు తప్ప మరెవ్వరూ నిర్వహించలేరు,' అని చెప్పి జాబిచ్చాడు.

వారు బయల్దేరారు. తాన్సేను తన మనసులో 'ఇదేదో చాలా ముఖ్యమైన కార్యమై ఉంటుంది. ఆ రాజుకు నా సంగీతం వినిపించి బహుమతి పొందుతాను,' అనుకుని సంతోషించాడు.

కాని వీరబల్ మట్టుకు, ఇందులో ఏదో రహస్యం ఉండకపోదు, అనుకుని వెయ్యి విధాల ఆలోచింపసాగాడు. చివరకెలా అయితేనేం, మహారణ్యాలు దాటుకుపోయి కొన్నాళ్లకు వారు బర్మా చేరుకుని, అవా రాజు దర్శనం చేసుకున్నారు.

వారు తెచ్చిన జాబు చదువుకున్నాడు రాజు. అందులో ఇలా ఉంది:

'నా సేవకులిద్దరు మీ దర్శనానికి ఈ లేఖ పట్టుకు వస్తారు. ఒక రహస్యాపరాధం చేయడం చేత వీరిని దండింపవలసి వచ్చింది. గోప్యంగా జరపవలసిన కార్యం కనుక ఇక్కడ ఆ పనిచేయ వీల్లేక, మీ వద్దకు పంపినాను, మీరు వారికి మరణ దండన విధించవలసింది.'

రాజు జాబు చదువుకుని మంత్రికి ఇచ్చాడు. అతడు ఇందులో ఏదో రహస్యముందని గ్రహించి, 'రాజా, వీరిని ఒక వారంరోజులు చెరలో పెట్టి, తరువాత యుక్తమైన దండన విధించుదాము,' అని సలహా చెప్పాడు. ఆ ప్రకారం వారి చేతులకు సంకెళ్ళు తగిలించి కారాగృహానికి తీసుకుపోయారు.

తాన్సేనుకు మతిపోయినట్లయింది. వీరబలుడికేసి చాలా దీనంగా ఏమిటి ఉపాయం? అన్నట్లుగా చూశాడు.

అప్పుడు వీరబలుడు అతని చెవిలో ఏదో ఊదాడు. లోన కుమిలిపోతున్నా, తాన్సేన్ పైకి ధైర్యంగానే కనబడసాగాడు.

గడువు వారం రోజులూ ముగిసింది. తలారులు వచ్చి వీరిని వధ్యస్థానానికి తీసుకుపోయారు.

అక్కడ వీరబలూ, తాన్సేనూ 'నన్ను ముందు చంపు అంటే నన్ను ముందు చంపు' అని పోరాడసాగారు.

తలారులు రాజువద్దకెళ్ళి, 'వీళ్లిద్దరూ పిచ్చివాళ్లు ప్రభూ!' అని మనవి చేశారు.

అప్పుడు రాజు వారిరువురిని పిలిపించి, 'ఎందుకిలా వాదులాడుతున్నారు?' అని అడిగాడు.



'రాజా ఆ విషయం చెబితే మాకు చాలా నష్టం కలుగుతుంది. అందుచేత చెప్పదలచలేదు,' అన్నాడు వీరబల్.

'నిజం చెప్పకుంటే యావజ్జీవ ఖైదు వేయిస్తా,' అన్నాడు రాజు.

ఇక తప్పదన్నట్లుగా, వీరబల్ ఇలా ప్రారంభించాడు. 'రాజా! చాలా కాలం నుంచి అవారాజ్యం కలుపుకోవాలని మా రాజు ఉద్దేశం. కాని, తమరు బలశాలులని బెదిరిపోతున్నాడు.

ఒకనాడు ఒక జ్యోతిశ్శాస్త్రవేత్త వచ్చి, రాజా! ఎందుకు విచారిస్తావు? నీ రాజ్యం లోని ఇద్దరిని అవా రాజు వద్దకు ఏదో మిషపైన పంపించు. వారిని రాజు కనుక చంపాడంటే, మొదట చచ్చినవాడు ఆ దేశానికి రాజవుతాడు. తర్వాత మరణించిన వాడు మంత్రి అవుతాడు. అప్పుడు వారు నీకు సామంతులుగా ఉంటారు. ఈ విధంగానే నీకు ఆ రాజ్యం దక్కుతుందే గాని, యుద్ధం చేసి గెలవడం నీతరం కాదు, అని చెప్పాడు. ఈ కారణం చేత మమ్మల్నిద్దరినీ పంపించాడు.

ఈ సంగతి వెల్లడించినందుకు మా రాజు మమ్మల్ని చంపే తీరుతాడు. కనుక అక్కడికి పోకుండా, మమ్మల్ని తమరే చంపించి పుణ్యం కట్టుకోండి ప్రభూ!'

అప్పుడు రాజు మంత్రికేసి చూశాడు.

మంత్రి రహస్యంగా ఇలా చెప్పాడు, 'రాజా, వీరి పరస్పర కలహం వల్ల మనకు అసలు రహస్యం అంతా తెలిసిపోయింది.

వీరిని చంపితిమా, మన రాజ్యం మనకు దక్కదు కనుక, వచ్చినదారినే వీరిని పంపి వేయడం మంచిది.'

మంత్రి మాటలను నమ్మిన రాజు వీర బలుడితో 'మిమ్మల్ని చంపమని మీ రాజు జాబు వ్రాసి పంపాడు. ఆజ్ఞ నెరవేర్చడానికి మేమేం వారి సేవకులం కాము. నిర్దోషు లను చంపిన పాపం మాకు వద్దు. వీరిని మీరే చంపుకోండి, అని మేము చెప్పినట్టు మీ రాజుతో చెప్పండి. పొండి!' అన్నాడు.

ఇందుకు వీరబల్ 'మహారాజా! ఇది తమకు న్యాయం కాదు. నేను మొదటే చెప్పానుగా, మా రహస్యం వెల్లడిస్తే మాకు హాని వస్తుందని? అనుకున్నట్లే అయింది' అన్నాడు దీనంగా.

'అదంతా మాకు తెలియదు. తెలిసి విషమెవరు తాగుతారు? పొండి పొండి. లేకుంటే బైటికి తరిమించివేస్తా,' అని బెది రించాడు రాజు.

వీరబల్ భయం నటిస్తూ, 'సెలవు! సెలవు!' అని తాన్సేన్‌ను వెంటబెట్టుకుని బయటపడి మళ్లీ ఢిల్లీనగరం చేరుకున్నాడు.

తాన్సేను అక్బరుని చూసి 'ప్రభూ! వీర బలుడే లేకుంటే నేను తమ దర్శనం చేసు కోగలిగేవాణ్ణే కాదు. అతని బుద్ధికుశలతే మా ఇద్దరినీ రక్షించింది..' అంటూ జరిగిన వృత్తాంతమంతా విన్నవించాడు.

అప్పుడు చక్రవర్తి, ఇదివరకు ఎదురు తిరిగిన ముసల్మానులందర్నీ పిలిపించి, వీరబలుని బుద్ధివిశేషం పరీక్షించడానికి తను పన్నిన పన్నుగడ, వీరబల్ బుద్ధి చాతుర్యం వారికి వివరించి చెప్పాడు. అప్పుడు ముసల్మానులందరికీ అక్బరు చక్రవర్తి చెప్పినది నిజమైన మాట అని నమ్మకం కలిగింది.

ఆ విధంగా ముసల్మానులందరికీ వీర బల్ పైన గల అసూయ పోయి, ఎంతో గౌరవభావం ఏర్పడింది.





# యుక్తిబలం

పూర్వం కాశ్మీర దేశాన్ని అవంతివర్మ పరిపాలిస్తూ ఉండేటప్పుడు ఏటా కరువులు వచ్చేవి. జనం తిండికి లేక అల్లాడిపోతూ ఉండేవారు.

కాశ్మీర్ ఎత్తయిన కొండల నడుమ ఉన్న దేశం. అక్కడి నదులు కొండల మీద పుట్టి మహావేగంగా దిగువకు ప్రవహిస్తాయి. ఆ కారణంచేత నదులు పొంగడమనేది తరచుగా జరుగుతుండేది.

నిజానికి అక్కడి భూమి చాలా సారవంతమైనది, మహాపద్మ సరస్సు కింద అనేక వేల ఎకరాలు చక్కగా సాగు అయి అధిక దిగుబడులతో పంట పండేది.

అయితే అది ప్రజలు అనుభవించే లోపుగా ఆ ప్రాంతంలోని వితస్తానది పొంగటమూ, నది వెల్లువ సరస్సులోనికి ప్రవహించటమూ, సరస్సు పొర్లి పంటలన్నీ నాశనం కావటమూ జరుగుతుండేది.

అవంతివర్మ ఎంతో ధర్మపరుడు. తన వల్ల ఏదో ద్రోహం జరగటం చేతనే తన ప్రజలు ఈ విధంగా కాటకం పాలవుతున్నారనుకున్నాడు.

దేవుళ్లకు ఎన్నో పూజలు చేయించాడు. గ్రహాలకు శాంతులు, యజ్ఞాలూ క్రతువులూ చేయించాడు. ఎన్ని చేసినా వరదలు నిలిచిపోలేదు.

ఇలా కొంత కాలం జరగగా రాజు చెవిని ఒక వార్త పడింది. సుయ్యా అనే వాడొకడు తాను వరదలు పోగొట్టగలనని కనబడ్డ వాళ్లందరి ఎదటా ప్రగల్భాలు పలుకుతున్నాట్ట. వాణ్ణి జనం పిచ్చివాడికింద జమకట్టి తెగవాదించి ఆనందిస్తున్నారు.

యమునాబాయి



ఏటా వచ్చే కాటకాలను పోగొట్టడానికి ఏదైనా చేయడానికి సిద్ధంగా ఉన్నందువల్ల అవంతివర్మ సుయ్యాను తన వద్దకు పిలి పించాడు. సుయ్యా వచ్చి నమస్కారం చేసి నిలబడ్డాడు.

'నీవు కాటకాలను పోగొడతానంటున్నా వట, నిజమేనా?' అని అడిగాడు రాజు.

'చిత్తం మహాప్రభూ! వరదలు పోతే కాటకం దానంతట అదే పోతుంది,' అన్నాడు సుయ్యా.

'వరదలు ఎలా పోతాయి? నువు పోగొ డతావా?' అన్నాడు రాజు.

'చిత్తం, నేను పోగొట్టగలను!' అన్నాడు సుయ్యా.

'మేము చేయలేని పనిని నీవొక్కడవే ఎలా చెయ్యగలవు?' అన్నాడు రాజు.

'డబ్బిప్పించండి. ప్రపంచంలో డబ్బు చెయ్యలేని పని ఏముంటుంది?' అన్నాడు సుయ్యా.

'మా ఖజానాలో ఉన్న డబ్బంతా పట్టు కుపో. కాని వచ్చేయేడు వరదలు రాకుండా చెయ్యి,' అన్నాడు రాజు.

మంత్రి రాజును వారించడానికి యత్నిం చాడు. కాని రాజు వినిపించుకోలేదు.

సుయ్యా ఖజానా నుంచి తాను మోయ గలిగినన్ని బంగారు నాణాలు మూటకట్టు కుని బయలుదేరాడు.

ప్రజలు కూడా అతని వెనకాలే కేకలు పెడుతూ, గేలిచేస్తూ బయలుదేరారు.

రాజుకు టోపీ వేసి సుయ్యా డబ్బు కాజేశాడని కొందరన్నారు. సుయ్యాతో బాటు రాజుకు కూడా పిచ్చిపట్టిందని మరి కొందరన్నారు. సుయ్యా ఆ ధనం తీసుకు పోయి ఏం చేస్తాడో చూడాలని అందరికీ బుద్ధిపుట్టింది.

ఏటా వరదలు తెచ్చే వితస్తా నది కొంత దూరం వెళ్లాక కొండల సందుగా కనుమలో కూడా ప్రవహిస్తుంది. కొన్ని వందల ఏళ్లుగా బ్రహ్మాండమైన బండరాళ్లు రెండువైపులా గల కొండలమీద నుంచి దొర్లివచ్చి నదికి అడ్డంగా వంతెనలాగా పడి ఉన్నాయి. వరదలు వచ్చినప్పుడు తప్ప మిగతా సమ యాల్లో ప్రజలు ఇక్కడే నదని దాటుతూ ఉంటారు కూడానూ. ఈ రాళ్ల వంతెన

మూలంగానే వరదలు రావటమూ, దాంతో సరస్సు పొర్లటమూ, పంటలు నాశనం కావటమూ జరుగుతూండేది.

సుయ్యా డబ్బు మూట మోసుకుని ఈ ప్రాంతానికే చేరుకున్నాడు. వాడివెనకనే వేలమంది మనుషులు కూడా వచ్చారు. సుయ్యా నదికడ్డంగా ఉన్న రాళ్ళమీదికి పోయి, తను తెచ్చిన మూటలో నుంచి బంగారు నాణాలు తీసి రాళ్లమధ్య గుప్పిళ్లతో పడేస్తూ అవతలి ఒడ్డుకు పోసాగాడు.

జనంలో హాహాకారాలు బయలుదేరాయి. సుయ్యా నిజంగా పిచ్చివాడేనని రుజువయింది. లేకపోతే బంగారం ఆ విధంగా నదిలో పారబొస్తాడా? వాణ్ణి ఆపటానికి కూడా ఎవరికీ శక్యం కాలేదు.

జనంలోని కొందరికి అకస్మాత్తుగా చైతన్యం కలిగింది. కొందరు గబగబా నీటిలోకి దిగి బంగారం కోసం వెతకసాగారు. మరికొందరు ముఠాలుగా చేరి పెద్ద పెద్ద బండరాళ్ళను ఒడ్డుకు తోసి వాటికింది ఉన్న బంగారు నాణాలు ఏరుకోసాగారు.

కొద్దికాలానికే ఈ వార్త చుట్టుపక్కల గ్రామాలకు పాకింది. లక్షలాది జనం వచ్చి, అనేకవందల ఏళ్లుగా నదికి అడ్డంగా పడి వున్న రాళ్లను ఒడ్డుకు పట్టించసాగారు. వాళ్ల ప్రయత్నాలను ప్రోత్సహించడానికి సుయ్యా ఖజానా నుంచి ఇంకా, ఇంకా బంగారు నాణాలు తెచ్చి కదిలించని రాళ్ల సందుల్లో పడెయ్యసాగాడు.

సాయంకాలం లోపుగా రాళ్లవంతెన దాదాపు నిర్మూలమైపోయింది. కష్టపడి పనిచేసిన ప్రజలందరికీ బంగారు నాణాలు దొరికాయి. అది మొదలు కాశ్మీర ప్రజలు వరదలూ, కాటకాలూ లేకుండా సుఖంగా జీవించారు.

సుయ్యా యుక్తికీ, అతడు దేశానికి చేసిన మేలుకూ మెచ్చుకుని అవంతివర్మ అతనికి చాలా ధనమిచ్చి సత్కరించాడు.





# లెక్కలు రాని రాజు

పూర్వం మగధ దేశాన్ని చతురంగవీరుడనే రాజు పాలిస్తుండేవాడు. ఆయన చదరంగం ఆటలో చాలా పేరు మోసినవాడు. ఎంతో నిపుణులైన ఆటగాళ్లు సైతం ఆయనతో చదరంగమాడి ఓడిపోయారు.

నిత్యమూ తనతో ఆడటానికి వచ్చేవాళ్లతో వేగలేక రాజు, నాతో చదరంగం ఆడి ఓడి పోయిన వారికి శిరచ్ఛేదం శిక్ష విధించబ డుతుంది, అని ప్రకటన చేశాడు.

ఈ ప్రకటన విన్న తరవాత ఆటగాళ్లు తండోపతండాలుగా వచ్చి రాజును ఆటకు పిలవటం మానేశారు.

ఎప్పుడన్నా ఒకరూ, ఇద్దరూ వచ్చినా రాజుగారు వారికి మరణశిక్ష గురించి చెప్పి పంపించేవాడు. కాదు కూడదని ఎవరైనా పట్టుపట్టి ఆటకు కూచుంటే రాజు వారిని ఆటలో ఓడించి, తన ప్రతిజ్ఞ నిలబెట్టుకునే టందుకు వారికి శిరచ్ఛేదం చేయించాడు.

ఈ విధంగా ఒకరిద్దరి తలలు తెగిపో యాక రాజుగారిని చదరంగం ఆటకు కూర్చోమన్నవారే లేకుండా పోయారు.

మంచి ఆటగాళ్లెవరూ రాని కారణం చేత రాజుకు కూడా చదరంగంతో రుణం తీరినట్టయింది.

ఆ కాలంలోనే కావేరీ నది తీరాన ఒక గొప్ప శాస్త్రజ్ఞుడు ఉండేవాడు. ఆయనకు చదరంగం ఆటలో మంచి నైపుణ్యం ఉంది. ఎవరైనా చదరంగం ఆడుతుంటే ఆయన ఆట మధ్యలో, తన నైపుణ్యాన్ని ఉపయో గించి ఇన్ని ఎత్తులలో నల్లరాజును కట్టించ వచ్చు, అని చెప్పేవాడు. అవకాశమిస్తే ఆట కట్టించి చూపేవాడు కూడా.

పి. రాజేశ్వరి

ఈ బ్రాహ్మడికి మగధ దేశపు రాజు యొక్క వృత్తాంతం తెలిసింది. ఆయనకు రాజుమీద ఆగ్రహం కలిగింది. ఆ రాజుకు తాను గెలుస్తానని అంత గర్వం దేనికి? చందరంగం ఆటయొక్క రక్తి ఆడటంలో ఉంది కాని గెలవడంలోనూ ఓడటంలోనూ లేదు. చదరంగం ఆట అన్న తరవాత దానిలో ఒక గెలిచేవాడుంటాడు. ఒక ఓడే వాడూ ఉంటాడు. ఓడిపోయినంత మాత్రాన ఈరాజు శిరచ్ఛేదం చేయిస్తాడా? ఆయన ఎటువంటి ఆటగాడు?

మగధరాజుకు ఎట్లాగైనా బుద్ధి చెప్పా లని ఈ బ్రాహ్మడికి అనిపించింది. ఆయన కాలినడకన ప్రయాణమై కొంతకాలానికి మగధ చేరాడు. రాజదర్శనం సంపాదిం చాడు.

'మహారాజా, నేను కావేరీతీరం వాణ్ణి. తమరు చదరంగం ఆటలో సాటిలేని నిపు ణులని విన్నాను. తమ ఆట చూసే అభి లాషతో ఇంత దూరం వచ్చాను.' అన్నాడు బ్రాహ్మడు.

'నిజమేనయ్యా? నాకూ చదరంగం ఆడాలనే ఉంది. కాని నాతో ఆడేవాడేడీ? నాతో ఆడి ఓడిపోయినవాడికి శిరచ్ఛేదం శిక్ష విధిస్తానని చాటింపు వేసి ఉన్నాను. అందు చేత నాతో ఎవరూ ఆడడానికి ధైర్యం చేయ లేకున్నారు!' అన్నాడు రాజు.

బ్రాహ్మడు కొంచెం ఆలోచించి, 'అలా అయితే, నేనే తమతో ఆడతాను,' అన్నాడు.



'పిచ్చి బ్రాహ్మడా! నిష్కారణంగా తల పోతుంది! ఓడితే శిరచ్ఛేదానికి సిద్ధమేనా?' అని అడిగాడు రాజు.

'ఆ ప్రశ్నకు సమాధానం చెప్పేముందు నాకు గల చిన్న సందేహం ఒకటి తమరు తీర్చాలి,' అన్నాడు బ్రాహ్మడు.

'ఏమిటి నీ సందేహం?' అని అడిగాడు రాజు.

'నేను ఆటలో ఓడితే నా తల తీసేస్తారు. కాని దారి తప్పి నేను ఆటలో గెలిస్తే తమరు నాకేమిస్తారు?' అన్నాడు బ్రాహ్మడు.

'నన్ను చదరంగంలో గెలిచినవాడు ఏది అడిగినా ఇస్తాను. ఏం కావాలి?' అన్నాడు రాజు.

'నేను గెలిస్తే ధాన్యం ఇప్పించండి. చద



రంగం బల్లలో ఉండే గళ్లలో, ఒక గడి కన్న మరొక గడికి రెట్టింపు గింజలచొప్పున పెంచుతూ, 64 గళ్లకూ ధాన్యం ఇప్పించండి, అంతకన్న నేను కోరేది లేదు,' అన్నాడు బ్రాహ్మడు.

'పిచ్చి బ్రాహ్మడా! నువు కోరేది ఇంత మాత్రమేనా? గెలుస్తావన్న ధైర్యం నీకున్నట్టు లేదు!' అన్నాడు రాజు.

'చిత్తం, ధైర్యం ఉండటమే కాదు! ఒక్క ఆట ఆడి మిమ్మల్ని రెండుసార్లు ఓడిస్తాను! అన్నాడు బ్రాహ్మడు.

'అంటే?' అన్నాడు రాజు ఆశ్చర్యంగా

'అది ఆట ఆడినాక మీకే తెలుస్తుంది,' అన్నాడు బ్రాహ్మడు.

మర్నాడు చదరంగం పందెం ఏర్పాటు చేశారు. ఆట చూడటానికి జనం తండోపతండాలుగా వచ్చారు. బ్రాహ్మడికి ఇవాళ ఆయువు మూడిందని అందరూ అనుకున్నారు. రాజు ఆట చాలా పట్టుదలగా ఆడాడు. కాని చివరకు బ్రాహ్మడే రాజు ఆటకట్టించాడు.

'నేను ఓడిపోయాను! నువు నిజంగా గొప్ప ఆటగాడివే. కాని నన్ను రెండుసార్లు ఓడిస్తానన్నావు. ఒకసారే ఓడించావు. నా రెండో ఓటమి ఏమిటి?' అని రాజు బ్రాహ్మడుని అడిగాడు.

'నా బహుమానం నాకు దయచేయించండి. తరవాత మీ రెండో ఓటమి సంగతి మాట్లాడదాం,' అన్నాడు బ్రాహ్మడు.

రాజు ధాన్యం బస్తాలు తెమ్మని భటులకు ఆజ్ఞాపించాడు.

'నాకు ఎంత ధాన్యం ఇవ్వవలసి వస్తుందో ముందు అంచనా వేయండి. ఆ అంచనా ప్రకారం బస్తాలు తెప్పించవచ్చు,' అన్నాడు బ్రాహ్మడు.

రాజ్యంలోని గణిత ప్రవీణులను పిలిపించాడు రాజు.

'మొదటిగడిలో ఎన్ని గింజలు పెట్టమన్నారు?' అని అడిగారు వారు.

'ఒక్కగింజ పెట్టండి చాలు!' అన్నాడు బ్రాహ్మడు.

రాజు బ్రాహ్మడి అల్పసంతోషానికి నవ్వాడు. మొదటి గడిలో ఒక గింజా, రెండో గడిలో రెండు గింజలూ, మూడోగడిలో

నాలుగు గింజలూ ఈ విధంగా 64 గడులకూ అయ్యే గింజల సంఖ్యను రాజుగారికి చూపారు.

18446744073709551615

రాజు నిర్ఘాంతపోయాడు.

'అవి ఎన్ని పుట్ల ధాన్యానికి సమానమో లెక్కవెయ్యండి,' అన్నాడు రాజు. గణిత శాస్త్రజ్ఞులు మానికకు ఎన్ని గింజలో కొలిచి, పుట్టికి ఎన్ని గింజలో గుణించి, మగధ రాజ్యంలో ఏటా ఎన్ని పుట్లు పండుతున్నాయో ఆరా తీసి చివరకు రాజుతో, 'మహారాజా, మనరాజ్యంలో రెండు లక్షల ఏళ్లపాటు పండే ధాన్యం మీరు బ్రాహ్మడికి ఇవ్వవలసి ఉంటుంది,' అని చెప్పారు.

రాజు ఆశ్చర్యానికి మేరలేదు.

'ఔర పిడుగా! ఇదేనా నువ్వు చెప్పిన నా రెండో ఓటమి?' అన్నాడు రాజు.

'చిత్తం మహారాజా! నేను కోరినది చాలా తక్కువనుకున్నారు. మీరు గెలిచి ఉంటే నేను సులువుగా నాతల ఇచ్చి ఉందును. నేను గెలిచాను కాని నేనడిగినది తమరు ఎలానూ ఇవ్వలేరు,' అన్నాడు బ్రాహ్మడు నవ్వుతూ.

'ఆటలో గెలిచావు గనక సరిపోయింది. ఓడిపోతే ఏమై ఉండును. ఇంత సాహసం ఎందుకు చేశావు,' అన్నాడు రాజు.

'నేను కోరిన ప్రకారం గింజలు ఇవ్వటానికి ఎప్పుడైతే మీరు సమ్మతించారో, అప్పుడే మీకు గణితజ్ఞానం లేదని తెలుసుకున్నాను. మీరు ఓడిపోతారని రూఢి చేసుకుని మరీ పందానికి సమ్మతించాను. నాపాటి గణితజ్ఞానం మీకుంటే మీతో చదరంగం ఆడుండను,' అన్నాడు బ్రాహ్మడు.

రాజు బ్రాహ్మడి జ్ఞానానికి చాలా సంతోషించి ఆయనకు బోలెడంత ధనం ఇచ్చి పంపేశాడు. అది మొదలు రాజు గర్వం మాని ఆడటానికి వచ్చిన వారందరితోనూ చదరంగం ఆడసాగాడు.



# నేరపరిశోధన

శ్రావస్తి నగరాన్ని ప్రసేనజిత్తు పరిపాలించే కాలంలో దూరదేశం నుంచి ఒంటరివాడైన బ్రాహ్మణుడు ఒకడు వచ్చాడు. అదృష్టవశాత్తూ నగరంలోని గొప్ప వైశ్యుల ప్రాపకం ఆ బ్రాహ్మణుడికి దొరికింది. నిత్యమూ ఆయనకు అన్న వస్త్రాలు పుష్కలంగా దొరకడమే గాక దానాలూ, దక్షిణలూ, సంభావనలూ దొరుకుతుండేవి. ఒంటరివాడు కావడం చేత ఆయన ఇలా దొరికిన సొమ్మును కొద్దికాలానికి వెయ్యి బంగారు దీనారాలుగా నిలువ చేసి, దాన్ని మరొక విధంగా భద్రపరచలేక, అడవిలో ఒక చోట పాతిపెట్టేశాడు.

భార్యా బిడ్డలూ, అన్నదమ్ములూ, బంధువులూ, ఎవరూ లేని ఆ బ్రాహ్మణుడి పంచప్రాణాలూ ఆ బంగారం మీదే ఉండేవి. రోజూ ఆయన అడవికి పోయి, తాను పాతిపెట్టిన ధనం ఎవరూ తవ్వుకు పోలేదు కదా అని చూసుకుని తిరిగి ఇంటికి వెళ్తుండేవాడు.

ఒకరోజు ఇలాగే ఆయన అడవికి పోయి చూసేసరికి అక్కడ బంగారం లేదు. అంతకుముందే దానినెవరో తవ్వి తీసుకున్నారు. ఇది తెలుసుకుని బ్రాహ్మణుడు పిచ్చెత్తిపోయి, గుండెలు బాదుకుని ఏడుస్తూ నగరంలో వచ్చి పడ్డాడు. కనిపించినవారి కల్లా తనకు కలిగిన ఆపదను గురించి చెప్పుకున్నాడు. ఆయనను ఓదార్చటం ఎలాగో ఎవరికీ తెలియలేదు.

'నా డబ్బే పోయాక నేను జీవించటం మాత్రం దేనికి? నది దగ్గరకెళ్ళి అందులో పడి ఆత్మహత్య చేసుకుంటాను!' అంటూ

టి. ప్రసాదరావు

బ్రాహ్మణుడు నదికేసి పరిగెత్తాడు.

రాజు ప్రసేనజిత్తు అప్పుడే నదిలో స్నానం చేసి తిరిగివస్తూ.. ఆత్మహత్య చేసుకోబోయే బ్రాహ్మణుడిని చూసి, విషయం తెలుసుకుని, 'ఎందుకయ్యా పిచ్చి బ్రాహ్మణుడా, ఆత్మహత్య చేసుకుంటావు? రాజ్యంలో దొంగతనం జరిగితే తెలుసుకునేటందుకు నేను లేనా? నీ సొత్తు అపహరించినవాణ్ణి పట్టుకుంటాను. లేదా, నీ సొమ్ము నా బొక్కసం నుంచి ఇప్పిస్తాను. నువు నీ డబ్బు పాతి పెట్టిన చోటుకు ఏమైనా గుర్తులుంటే చెప్పు?' అని అడిగాడు.

'మహాప్రభూ, నేను ధనం పాతిపెట్టినచోట అడవిబీర మొక్క ఒకటి గుర్తుండేది. ఇప్పుడు అది కూడా పోయింది,' అన్నాడు బ్రాహ్మణుడు.

'అడవిబీరమొక్క ఎలా గుర్తవుతుంది. అలాంటివి అడవిలో ఎన్నయినా ఉండవచ్చు గదా?' అన్నాడు రాజు.

'లేదు, మహాప్రభూ! ఆ ప్రాంతంలో అదొక్కటే అడవిబీరమొక్క,' అన్నాడు బ్రాహ్మణుడు.

'అయితే, నువ్వక్కడ సొమ్ము దాచిన సంగతి ఎవరెవరికి తెలుసు?' అన్నాడు రాజు.

'మహాప్రభూ, నాకు తప్పనిచ్చి మరే పిట్టకు కూడా తెలీదు. చెప్పుకునేటందుకైనా నాకెవరున్నారు? నేనక్కడికి పోవటం



ఎన్నడూ ఎవరూ చూసి ఉండలేదు,' అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు తన భవనానికి తిరిగి వచ్చి ఈ దొంగతనం గురించి చాలా తీవ్రంగా ఆలోచించాడు. ఆ దొంగను పట్టుకునే ఉపాయం రాజుకు కొద్దిసేపట్లోనే స్ఫురించింది. ఆయన మంత్రిని పిలిపించి:

'మంత్రీ, నాకు ఆరోగ్యం సరిగా లేదు. వెంటనే నేను వైద్యులను చూడటం మంచిదనుకుంటున్నాను. నగరంలో ఉన్న వైద్యుల నందరినీ పిలిపించండి,' అన్నాడు.

త్వరలోనే వైద్యులంతా వచ్చారు. రాజు ఒక్కొక్కరినే తన సన్నిధికి రప్పించి, 'ఏమయ్యా, నువు నిన్నా, ఇవాళ ఏయే

రోగాలకు ఎలాంటి ఔషధం ఇచ్చావు? ఏయే మూలికలు వాడావు?' అని ప్రశ్నించాడు.

వారంతా చెప్పింది విని పంపివేయసాగాడు. ఇదంతా యోచనగా చూస్తున్న మంత్రికి రాజుగారి అభిప్రాయం కొంచెమైనా అర్థం కాలేదు.

ఆఖరుకు ఒక వైద్యుడు, 'మహాప్రభూ, మాతృదత్తుడు అనే వైద్యశిఖామణికి అడవి బీరమొక్క రసం నిన్న వాడాను,' అన్నాడు.

రాజు ఆసక్తితో, 'అలాగా? ఆ మొక్క ఎక్కడ దొరికింది?' అని అన్నాడు.

'అడవిలో కష్టపడి వెతికి నా సేవకుడు పట్టుకొచ్చాడు మహారాజా,' అన్నాడు వైద్యుడు.

'అయితే, ఆ సేవకుణ్ణి మావద్దకు వెంటనే పంపించు,' అన్నాడు రాజు.

వైద్యుడి సేవకుడు రాగానే రాజు 'ఒరే, నిన్న నీవు అడవిబీర మొక్కను తవ్వినప్పుడు దానికింద దొరికిన వెయ్యి దీనారాలూ ఏం చేశావు?' అన్నాడు.

సేవకుడు తెల్లబోయి, 'మా యింట దాచాను, మహారాజా!' అన్నాడు.

'అవి ఫలాని బ్రాహ్మణుడివి. అతడికి వప్పగించు. వెళ్లు,' అన్నాడు రాజు.

చిత్తమంటూ సేవకుడు నమస్కరించి వెళ్లిపోయాడు.

ఇదంతా పరికిస్తున్న మంత్రికి, రాజు ఏవిధంగా ఆ బంగారం ఎత్తుకుపోయిన వాణ్ణి గుర్తించాడో ఎంత ఆలోచించినా బోధపడలేదు.



రాజునే అడిగి ఆ రహస్యం తెలుసు కోదలిచాడు.

'మహారాజా, మీరీ దొంగతనం చేసిన వాన్ని ఇంత సులువుగా ఎలా పట్టగలిగారో నాకు అర్థం కాలేదు.' అన్నాడు మంత్రి.

రాజు చిరు నవ్వు నవ్వి ఇలా వివరించాడు.

'దొంగతనం గురించి బ్రాహ్మణుడు చెప్పినదంతా నిజమనే నమ్మకంతోటే నేను దొంగను పట్టటానికి ఆలోచించాను. నగరంలోని ఇన్ని లక్షలమందిలో ఒక్కడే ఆ దొంగతనం చేసి ఉండాలి గద! అక్కడ ధనం ఉన్న సంగతి ఏ ఒక్కరికి గాని తెలియదని బ్రాహ్మణుడు చెబుతున్నాడు. ఆ ప్రత్యేక స్థలంలో ధనం ఉన్నదని తెలియకుండా అక్కడ తవ్వవలసిన అవసరం ఎవరికి కలుగుతుంది? అడవిబీర మొక్కతో పని ఉన్నవాడికి మాత్రమే. ఆ చుట్టుపక్కల ఎక్కడ కూడా అడవిబీర మొక్క లేదని, ఆ సంగతి బంగారం పోగొట్టుకున్న బ్రాహ్మణుడే చెబుతున్నాడు. అది నిజమేనని నాకు నమ్మకం కలిగింది.

అదీ గాక, ధనంకోసమే తవ్వినవాడెవడైనా అడవిబీర మొక్కను అక్కడే పారేసి పోతాడు. కానీ అడవిబీర మొక్క కోసం తవ్విన వాడైతేనే మొక్కనూ, దాంతో పాటు ధనాన్నీ కూడా తీసుకుపోవడం జరుగుతుంది. అయితే అడవిబీర మొక్కతో ఎవరికి పని ఉంటుంది? వైద్యుడికి! అందుచేతనే వైద్యులందరినీ పిలిపించాను. అడవిబీర మొక్కతో వైద్యం చేసిన వైద్యుడు దొరకగానే దొంగ కూడా దొరికిపోయాడు. ఇందులో కష్టం ఏమిటి, మంత్రీ?'

ఈ మాటలను విని ప్రసేనజిత్తు తెలివితేటలకు మంత్రి చాలా సంతోషించాడు.





# అన్యాయం మంగలిది

పూర్వం బాగ్దాద్ నగరంలో ఆలీ అనే మంగలి ఉండేవాడు. అతడు అందరు మంగళ్లవంటివాడు కాడు. క్షౌరం చేయటంలో వాడికి గొప్ప నైపుణ్యం ఉండేది. బాగ్దాదులోని ధనికులూ, పలుకుబడి గలవారూ ఆలీ చేతనే క్షౌరం చేయించుకునేవారు. ఒకనాడు ఆలీ ఇంట్లో వంటచెరకు కావలిసి వచ్చింది. దాంతో కట్టెలవాళ్ల కోసం చూస్తూ అతను వీధివాకిట నిలబడ్డాడు. కొద్ది సేపట్లోనే కట్టెలు కొట్టేవాడొకడు గాడిద మీద కట్టెలమోపు వేసుకుని అటుగా వచ్చాడు.

ఆలీ వాణ్ణి పిలిచి, 'నాకు నీతో బేరమాడేటందుకు తీరిక లేదు గాని, ఆ గాడిదపై ఉన్న కఱ్ఱ యావత్తూ ఐదు రూపాయలకి ఇస్తావా?' అని అడిగాడు.

బాగ్దాదులో వంటచెరకుకు గిరాకీ హెచ్చు. సులువుగా దొరకదు కూడా. అయినా ఆ పేదవాడు పెద్దబేరం గదా అని సరేనన్నాడు. వాడు గాడిదమీది కట్టెలన్నీ దింపేసి డబ్బు అడిగాడు.

'గాడిద వీపున ఉన్న కొయ్య జీను మాట ఏమిటి? అంతా కలిపే మాట్లాడాను,' అన్నాడు ఆలీ.

'అదెట్లా?' అన్నాడు కట్టెలవాడు.

'ఆ జీను కూడా కఱ్ఱది కాదా? గాడిద మీద ఉన్న కర్రయావత్తూ ఐదు రూపాయలకి బేరం చేశాను,' అన్నాడు ఆలీ.

'ఇదేం బేరమండోయ్? దీనికి నేనెంత మాత్రం ఒప్పను,' అన్నాడు కట్టెలవాడు.

ఇది విని ఆలీ కట్టెలవాడి దవడ వాయగొట్టి కట్టెలూ, జీనూ కూడా లాక్కుని

హెచ్. నారాయణ మూర్తి

పంపేశాడు. దెబ్బలు తిన్న కట్టెలవాడు చెప్పలేని బాధతోనూ, ఏడుస్తూ న్యాయాధికారి వద్దకు పోయి జరిగినది విన్నవించుకున్నాడు.

కాని ఆ న్యాయాధికారికి క్షౌరం చేసేది ఆలీయే కావటం చేత, ఆయన కట్టెల వాడి మొర వినిపించుకోలేదు.

కట్టెలవాడు ఇంకా పెద్ద న్యాయాధికారి దగ్గరికి వెళ్ళి మొరపెట్టుకున్నాడు. ఆయనకూ ఆలీయే మంగలి కావడంతో, వాడి మొర పెడచెవిని పెట్టాడు.

'నాకెవరూ సహాయం చేసేవాళ్ళు లేరు. నా గతి అంతే!' అనుకుంటూ కట్టెల వాడు ఇంటిదారి పట్టాడు.



వాడికి దారిలో ఒక ముసలివాడు ఎదురై, 'ఏమిటి నాయనా, అంత విచారంగా ఉన్నావు?' అని అడిగాడు. దానికి కట్టెలవాడు ముసలివాడి దగ్గిర తన సొద వెళ్ళబోసుకున్నాడు.

'దీనికే ఇంత బేజారైపోతావెందుకు? నువు మన ఖలీఫా దగ్గిరికి వెళ్ళి చెప్పుకో. నీకు న్యాయం జరగవచ్చు,' అని ముసలివాడు కట్టెలవాడికి సలహా ఇచ్చాడు.

కట్టెలవాడు రాజభవనానికి వెళ్ళాడు. కొద్ది సేపట్లోనే వాడికి ఖలీఫా దర్శనం లభించింది. వాడు ఖలీఫాను సమీపించి ఆయన పాదాల వద్ద నేలను తాకి సలాం చేశాడు. ఖలీఫా వాడు వచ్చినపనిని విచారించాడు.

కట్టెలవాడు జరిగినదంతా చెప్పాడు.

'న్యాయం ఆలీ పక్షానే ఉంది. అయినా నీకు ధర్మం జరిగే ఉపాయం చెబుతాను విను,' అంటూ ఖలీఫా కట్టెలవాడి చెవిన ఒక రహస్యం చెప్పాడు.

కట్టెలవాడు ఖలీఫాకు మరొకసారి సలాం చేసి నవ్వుతూ ఇంటికి వెళ్ళాడు.

కొద్ది రోజులు గడిచాక. కట్టెలవాడు మంగలి ఆలీ వద్దకు పోయి, 'నాకూ, నా నేస్తానికీ క్షౌరం చెయ్యటానికి ఏం పుచ్చుకుంటావు?' అని అడిగాడు.

'రెండు రూపాయలిస్తే మీ ఇద్దరికీ క్షౌరం చేస్తాను,' అన్నాడు ఆలీ.

'మంచిది. ముందు నాకు క్షౌరం చెయ్యి,' అన్నాడు కట్టెలవాడు.

వాడి తల నున్నగా గొరిగేసినాక ఆలీ, 'నీ నేస్తమెక్కడ?' అని అడిగాడు.

'బయట ఉండొచ్చు. లోపలికి తీసుకొస్తాను,' అని కట్టెలవాడు బయటికెళ్ళి తన గాడిదెను లోపలికి లాక్కొచ్చాడు.

'ఈ మనిషి నేస్తానికి క్షౌరం చెయ్యి, అన్నాడు కట్టెలవాడు.

'ఏమిటీ?' గాడిదకు క్షౌరం చెయ్యమంటావా? అన్నాడు ఆలీ మండిపడి.

తక్షణం వెళ్ళకపోతే చావగొడతానని బెదిరించాడు.

వెంటనే కట్టెలవాడు ఖలీఫా వద్దకెళ్ళి మంగలి ఆలీ మీద ఫిర్యాదు చేశాడు.

ఫిర్యాదును విన్న ఖలీఫా, తన భటులను పిలిపించి, 'మంగలి ఆలీని కత్తులతో సహా తక్షణం పట్టుకురండి,' అని ఆజ్ఞాపించాడు.

వాళ్ళు ఆలీని పట్టుకొచ్చారు.

'ఈ మనిషి నేస్తానికి క్షౌరం చెయ్యటానికి మాట ఇచ్చి తరవాత చేయనని నిరాకరించావుట. ఏమిటి కారణం? అని అడిగాడు ఖలీఫా కోపంగా.

ఆలీ నేలకు వంగి సలాం చేసి, 'ఏలిన వారు చెప్పినది నిజమే గాని, మనిషికి గాడిద నేస్తం కావటం గాని, గాడిదకు క్షౌరం చెయ్యడం గాని లోకంలో ఎక్కడైనా కద్దా? అని అడిగాడు.

'నువ్వన్నది నిజమే. కాని జీనును వంట చెరుకుకింద కొనటం మటుకు ఎక్కడైనా కద్దా? వెంటనే ఈ గాడిదకు క్షౌరం చెయ్యి,' అన్నాడు ఖలీఫా.

ఆలీకి తప్పలేదు. వాడు గాడిద శరీరానికి సబ్బునురుగు రాచి క్షౌరం చేస్తుంటే దర్బారులో ఉన్న వారంతా విరగబడి నవ్వారు. ఆలీ పరువంతా బుగ్గిలో కలిసిపోయింది.

నాటినుంచి ఎవరూ అతడి వద్ద క్షౌరం చేయించుకునే వారు కాదు.



# ఎవరు జూదగాడు?

హేలాపురిలో ఒకప్పుడు ధనంతో జూదం ఆడటం పెద్ద నేరంగా పరిగణింపబడేది. ధనం ఒడ్డి జూదం ఆడుతూ రక్షక భటులకు పట్టుబడిన వారికి కఠినమైన శిక్ష విధించబడేది.

ఒకసారి ఓ నలుగురు ఆసాములు రచ్చబండ దగ్గర, ధనం ఫణంగా పెట్టి మేక-పులి జూదం ఆడుతుండగా రక్షక భటులు వాళ్లను బంధించి న్యాయాధికారి వద్ద ప్రవేశపెట్టారు.

'అయ్యా నేనసలు జూదం ఆడలేదు. ఆడుతున్న వాళ్లను చూస్తూ, అక్కడ ఉన్నాను అంతే. సత్యప్రమాణంగా' అన్నాడు ఆ నలుగురిలో ఒక వ్యక్తి వినమ్రంగా.

ఆ విషయం నమ్మిన న్యాయాధికారి ఆ వ్యక్తిని విడుదల చేశాడు.

'అయ్యా, నేను మన సేనాధిపతి గారి దగ్గరి బంధువునండి, ఈసారికి క్షమించి వదిలేయండి.' అని మరో వ్యక్తి ప్రాధేయపడగా అతన్ని కూడా విడుదల చేశాడు న్యాయాధికారి.

మూడో వ్యక్తి న్యాయాధికారి మిత్రుడి కుమారుడిగా రుజువు కావడంతో అతను కూడా విడుదలైపోయాడు.

న్యాయాధికారి, నాలుగోవ్యక్తి వైపు తిరిగి 'ధనంతో జూదమాడటం నేరమని నీకు తెలియదా? నీకు మూడు నెలల కఠిన కారాగార శిక్ష విధిస్తున్నాను,' అన్నాడు తీవ్రంగా.

'అయ్యా, అసలు నేను ఎవరితో జూదమాడేనో చెప్పగలరా?' అని ప్రశ్నించాడు ఆ నాలుగో వ్యక్తి.

న్యాయాధికారి నోట్లో పచ్చివెలక్కాయ పడినట్లయింది. నాలుగో వ్యక్తి కూడా విడుదలయ్యాడు.

– కె.ఎస్.వి. ఆంజనేయులు



# అతితెలివి

ఒక ఆసామి తన పొరుగు ఆసామి వద్ద ఒక కుండ అరువు తీసుకున్నాడు. అందులో వెన్న కాచుదామని అతను నిప్పు చేస్తూండగా ఎక్కడినుంచో పిల్లి వచ్చి కుండపైన కాళ్లు పెట్టి లేచి నిలబడింది. అది చూసి అతను పిల్లిని తరుమబోయాడు. పిల్లి వెనక్కు దూకింది. కుండ అరుగుమీద నుంచి కింద పడి రెండే రెండు ముక్కలయింది.

కుండ అరువు తెచ్చినవాడు తడువుకోకుండా రెండు ముక్కలూ జిగురు పెట్టి అంటించి, పొరుగువాడి వద్దకు తీసుకుపోయి, 'ఇదుగో నీ కుండ' అని ఇచ్చేశాడు.

పొరుగువాడు పగులు గమనించి 'ఏమిటిది?' అన్నాడు.

ఆసామి, 'నాకు తెలియదు' అంటూ ఇంటికి వచ్చాడు.

పొరుగువాడు న్యాయస్థానంలో పిర్యాదు చేశాడు. ఆసామి న్యాయవాది వద్దకు వెళ్లి సలహా అడిగాడు. న్యాయవాది అంతా విని, 'జరిగినదానికి సాక్షులెవరూ లేరు గనక నువు మూడు విధాలుగా సమర్థించుకోవచ్చు. నువు కుండ అరువు తీసుకున్నప్పుడే అది పగిలి ఉన్నదనవచ్చు. లేదా, నువు దానిని తిరిగి ఇచ్చాక పగిలిందేమోననవచ్చు; అన్నిటికన్నా భేషయినదేమంటే, అసలు నువు కుండ తీసుకోలేదనవచ్చు,' అన్నాడు. కుండ ఖరీదు పావలే అయినా మంచి సలహా చెప్పినందుకు న్యాయవాదికి రూపాయి ఇచ్చి ఆసామి ఇంటికి వచ్చాడు.

మర్నాడు న్యాయస్థానంలో విచారణలో, ఆసామి న్యాయమూర్తితో ఇలా విన్నవించుకున్నాడు. 'అయ్యా, నేనా కుండ తీసుకున్నప్పుడే అది పగిలి ఉన్నదండి. ఆ మాటకు వస్తే అది నేను తిరిగి ఇచ్చినాక పగిలిందేమో నాకా సంగతి తెలియదండి. అన్నిటికన్న ముఖ్యమేమంటే నేనసలు ఆ కుండను అరువు తీసుకోనే లేదండి!' న్యాయవాది సలహా ఇంత బాగా పాటించినా న్యాయాధికారి తనకు రెండు రూపాయలు జరిమానా ఎందుకు వేశాడో ఆసామికి అర్థం కాలేదు. ఆయన డబ్బు చెల్లించి న్యాయవాదులను తిట్టుకుంటూ ఇంటికి వెళ్లాడు.






# శిథిలాలయం - 23

(జాంగ్‌లాను కంచరగాడిదకు కట్టించి, వాణ్ణే ముందుండి దారి తీయమని శిఖిముఖి ఆజ్ఞాపించాడు. మధ్యాహ్నం వేళకు అందరూ ఒక నదీతీరం చేరారు. అక్కడ జాంగ్‌లా పైకి ఒక చిరుత దూకింది. పులీ, వాడూ మొసళ్ళున్న నదిలో పడ్డారు. ఆ సమయంలో నది అవతలి నుంచి రివ్వుమంటూ బాణాలు రాసాగినై. తరవాత --)

నది ఆవలి గట్టు నుంచి జాంగ్‌లా, చిరుత పులుల కేసి బాణాలు రావడం చూస్తూనే శిఖిముఖి ఓ క్షణకాలం ఆశ్చర్యపడి, విక్రమకేసరిని హెచ్చరించాడు.

ఆ బాణాలను వదులుతున్న వాళ్ళు జాంగ్‌లా మిత్రులు అని అతడికి అనుమానం కలిగింది. ఆ మిత్రులు మరెవరో కాదు. పూజారి ముఠా!

'కేసరీ! మనం నదీతీరం నుంచి కొంచె వెనక్కు రావడం మంచిది. నది అవతలి నుంచి బాణాలను కొడుతున్న వాళ్ళు పూజారి ముఠా. సందేహం లేదు. మనం వాళ్ళ బాణం దెబ్బలకు అందుబాటులో ఉన్నాం, జాగ్రత్త!' అన్నాడు శిఖిముఖి.

శిఖిముఖి హెచ్చరిక వింటూనే కేసరీ, అజిత వీరభద్రులు నదీతీరం నుంచి బాగా వెనక్కు వచ్చేశారు. ప్రవాహంలో జాంగ్‌లా, చిరుతపులీ ఒకరి నుంచి మరొకరు వేరు పడిపోయారు. జాంగ్‌లా మునుగుతూ తేలుతూ, నది అవతలి ఒడ్డుకు చేరేందుకు ప్రయత్నిస్తున్నాడు. చిరుతపులి గిలగిల తన్నుకుంటూ ప్రవాహంలో కొట్టుకుపోతున్నది. మొసళ్ళు కొన్ని బాణాలు తగలటంతో బెదిరిపోయి దూరంగా పోసాగినై.

దాసరి సుబ్రహ్మణ్యం



ఈ స్థితిలో చెట్లచాటు నుంచి ఒక దృఢ కాయుడు తెప్ప నొకదాన్ని ఈడ్చుకుంటూ వచ్చి నదిలోకి వదిలాడు. అతడి వెనకగా పరిగెత్తుకొచ్చిన ఇద్దరు వ్యక్తులు ఎగిరి దానిమీద ఎక్కి, చిన్న చిన్న తెడ్లతో దాన్ని జాంగ్‌లా కేసి తోసుకుపోసాగారు. తెప్ప లాక్కొచ్చిన దృఢకాయుణ్ణి చూస్తూనే శిఖి ముఖి వాడెవడైందీ గుర్తించాడు.

శిఖిముఖి, విక్రమకేసరితో వానికేసి చూపిస్తూ, 'వాణ్ణి గుర్తించావా? వాడు సవ రభేరుండం, పూజారి నౌకరు. గురిచూసి బాణం గుండెల్ని దూసుకుపోయేలా కొట్టు,' అన్నాడు.

విక్రమకేసరి బాణం వదిలేందుకు గురి చూసేంతలో, సవరభేరుండం అయిదార డుగుల ఎత్తున్న ఒక డాలును పట్టుకుని, దానిమీంచి తలపైకెత్తి శిఖిముఖి కేసి చూస్తూ, 'వాడెవడు, శిఖిముఖా? శబర పెద్ద శివాలుడి కొడుకా? ఎక్కడి కుంభార మిట్టపల్లె, ఎక్కడి ఈ బ్రహ్మపుత్రానదీ లోయలు! చావదలిస్తే ఇంత దూరం రావాలా? వృధాప్రయాస,' అన్నాడు.

సవరభేరుండం మాట ముగించే లోపలే విక్రమకేసరి వదిలిన బాణం రివ్వుమంటూ పోయి డాలు పైభాగాన్ని తాకి, కింద పడి పోయింది.

భేరుండం ఆ దెబ్బకు ఎగిరిపడి 'నా మాటలు వినబడుతున్నయ్యా? ఈ డాలు పూజారి దొర మంత్రించి నాకిచ్చింది. దీని వెనుక ఉన్నవాడికి ప్రాణభయం లేదు!' అన్నాడు.

విక్రమకేసరి విల్లుకు మరో అంబు పెట్టి వదలబోయేంతలో సవరభేరుండం దగ్గిరకు శిథిలాలయ పూజారి వచ్చాడు.

పూజారిని చూస్తూనే శిఖిముఖి చప్పున విక్రమకేసరికేసి తలతిప్పి, 'కేసరీ! ఇప్పుడు నువ్వు కొట్టవలసింది శిథిలాలయ పూజారిని. బాగా గురి చూడు. మేము తక్కిన వాళ్ళ సంగతి చూస్తాం,' అన్నాడు.

ఆ వెంటనే శిఖిముఖీ, అజితవీరభద్రులు కూడా విల్లంబులు చేతికి తీసుకున్నారు.

అందరూ మోకాళ్ళమీద వంగి బాణాలు వదిలేందుకు గురి చూస్తున్నంతలో పూజారి

పెద్దగా నవ్వుతూ కొంచెం వెనక్కుపోయి, 'ఒరే, మూర్ఖుల్లారా! మీ బాణాలు ఇంత దూరం వచ్చి నన్ను తాకలేవు. అయినా ప్రయత్నించండి,' అంటూ కేక పెట్టి తన పక్కనున్న అడవి దొంగలకు సంజ్ఞ చేశాడు.

దొంగలు గబగబా విల్లుకు బాణాలు సంధించి, శిఖిముఖి వాళ్ళకేసి విడవసా గారు. కాని, అవి వాళ్ల వరకూ రాకుండా మధ్య ఉన్న నదిలో పడిపోసాగినై.

శిఖిముకీ అతడి అనుచరులూ వదిలిన బాణాలు కూడా, పూజారి ముఠాను తాక లేదు. ఈ విధంగా నాలుగైదు నిమిషాల పాటు బాణాలు వదిలింతర్వాత, ఇందు వల్ల ప్రయోజనం లేదని పూజారికీ, శిఖి ముఖికి కూడా తెలిసిపోయింది.

శిఖిముఖి తన అనుచరులకు ఇక బాణాలు వ్యర్థపరచవద్దని చెప్పి, 'మనం ఊహించినట్లు శిథిలాలయ పూజారి మన వెన్నంటే వస్తున్నాడు. మన కన్న ముందుగా వాడు నది దాటాడంటే, బహుశా వాడు ఈ సరికే గోల్‌భరా గ్రామం పోయి అక్కడి వాళ్ల నుంచి శిథిలాలయాన్ని గురించి చాలా భోగట్టా సంపాయించుంటాడు,' అన్నాడు.

'అలా జరిగినట్లే తోస్తున్నది. జాంగ్ లాను మన మీద తెలివిగా ప్రయోగించి ఆ దుర్మార్గుడు మన రహస్యాలు చాలా గ్రహించాడు,' అన్నాడు విక్రమకేసరి.

'ఇప్పటి సమస్య ఎవరు ముందుగా శిథిలాలయాన్ని చేరతారనేదే. గోల్‌భరా



గ్రామంలో దాన్ని గురించిన వివరాలు మనం తెలుసుకుందాం అనుకున్నాం. ఒక వేళ పూజారి అక్కడికి ముందుగా పోయినా ముంచుకుపోయింది లేదు. వాణ్ణి ఆ శిథి లాలయ ప్రాంతంలోనైనా చేజిక్కించుకుని సర్వనాశనం చేయగలం,' అన్నాడు శిఖి ముఖి.

నదికి అవతలి నుంచి పూజారి ముఠా, ఇవతలినుంచి శిఖిముఖీ అతడి అనుచ రులూ, ఒకళ్ళనొకళ్ళు కొంతసేపు క్రోధంగా చూసుకుంటూ నిలబడ్డారు.

అప్పటి పరిస్థితుల్లో ఎవరికెవరూ హాని కలిగించలేరని రుజువైంది. శిఖిముఖి కొంచెం సేపు ఆలోచించి, విక్రమ కేసరితో, ఇక మనం ఆ జాంగ్‌లా చెప్పిన కొండ




చరియ కేసి బయలు దేరుదాం. గోల్‌భరా గ్రామాన్ని చేరేందుకు అది చుట్టుదారి అయినా తప్పదు. ఈ మొసళ్ల నదిని శత్రువులు అవతలి గట్టున కాపు వేసుకుని ఉండగా దాటాలని ప్రయత్నించడం ప్రమాదానికి దారితీస్తుంది, అన్నాడు.

శిఖిముఖి ఇలా అనగానే, అందరూ ప్రయాణ సన్నాహాలు ప్రారంభించారు. తమ తమ సామానులన్నీ కంచరగాడిదల మీద వేసి, నదీతీరం వెంట నడుస్తూ సూర్యాస్తమయం వేళకు కొండ ప్రాంతాన్ని చేరి అక్కడున్న చిన్న కొండ చరియ నొకదాన్ని చూశారు.

నలుమూలల చీకటి ముసురుకుంటున్న సమయంలో ఇరుకుగా ఉన్న కొండ చరియను దాటాలనటం ప్రమాదకారణం అవుతుందని శిఖిముఖీ, విక్రమకేసరీ సంప్రతించుకుని నిర్ణయానికి వచ్చారు.

ఆ ఇరుకు దారిలో పూజారి ముఠా ఏ రాళ్లచాటునో ఉండ తమ మీద హఠాత్తుగా దాడి చేయవచ్చు...

రాత్రి రెండు జాములు ముగిసేలోపలే అందరూ భోజనాలు చేశారు. తాము దిగిన చోట నెగడు వేయటం వల్ల, పూజారి ముఠాకు తమ ఉనికి తెలిసిపోతుందన్న భయంతో శిఖిముఖి వాళ్లు నెగడు వెలిగించలేదు. కాని, కాపలాకు ఒకరు కాకుండా ఇద్దరు చొప్పున ఉండటం మంచిదని నిశ్చయించుకున్నారు.

అర్ధరాత్రి వరకూ, ఎక్కడో దూరాన అరణ్య మృగాల అరుపులు తప్ప, వాళ్లున్న ప్రాంతాన మాత్రం ఎలాంటి సంచలనం కలగలేదు.

ఆ తరువాత నదివైపు నుంచి ఏవో ధ్వనులు వినిపించసాగినై. వాటిక్కారణం నదిలోని మొసళ్లు ఏదో ఆహారం కోసం పోట్లాడుకోవడంగా అజితవీరభద్రులు భావించారు. కాని, ఆ ధ్వనులు విన్న కొందికీ మరింత అధికం కావటంతో వాళ్లిద్దరూ కత్తులు చేతబట్టుకుని జాగ్రత్తగా నడుస్తూ నదిని సమీపించారు.

నల్లని చీకటి పరుచుకుపోయిన నదిలో కొన్ని మానవాకారాలు కదులుతూండటం వాళ్లిద్దరి కంటబడింది.




శత్రువులు తెప్పలమీద నదిని దాటు తున్నారన్న సూచనగా వాళ్ల ఛాయలు అటూ ఇటూ ఊగిసలాడుతున్నవి. అలా జరిగినప్పుడల్లా నీళ్లు కలిసినట్లు శబ్దం చేస్తూన్నవి. వాళ్లు అతి జాగ్రత్తగా తెడ్లు వేస్తున్నారన్నమాట. అజితవీరభద్రులు, శిఖిముఖిని, విక్రమకేసరినీ హెచ్చరించేం దుకు చప్పున ఉన్న చోటినుంచి కదిలి వెనక్కు పరిగెత్తబోయారు.

అంతలో వాళ్లమీద చిక్కగా అల్లిన వెడ ల్పాటి వల ఒకటి విసురుగా వచ్చి పడింది. వాళ్ళు దాన్నుంచి తప్పుకునేందుకు ప్రయ త్నించేలోపలే ఇద్దరూ అందులో కదిలేం దుకు కూడా వీలులేకుండా బిగించబ డ్డారు. ఈ రకం వలల్ని ఆటవికులు, జింక లనూ, లేళ్లనూ పట్టేందుకు ఉపయోగి స్తుంటారు.

అజితవీరభద్రులు వలలో గిలగిల తన్నుకుంటూ, తమ యజమానుల్ని హెచ్చ రించేందుకు అరవబోయేంతలో రెండు బలమైన చేతులు వాళ్ళ కంఠాలమీద పడినై. వాళ్లు ఉక్కిరిబిక్కిరైపోయారు.

'అరిచేందుకు ప్రయత్నించకండి. మీ నాయకులిద్దర్నీ ఇదివరకే బంధించాం,' అన్నదో కంఠం కోపంగా.

ఆ మాట్లాడినవాడి దగ్గిరకు మరిద్దరు ఆటవికులు వచ్చారు.

తమను బంధించిన వాళ్లు ఏనుగు చర్మాలూ ధరించి ఉండటం అజిత వీర భద్రులు గుర్తించారు. అంటే వీళ్లు శిధిలా లయ పూజారి ముఠా వాళ్ళు కాదన్న మాట! ఇంతకు ముందు తమను హెచ్చ రించినవాడన్నట్టు, నిజంగా వీళ్లు ఈ సరికే శిఖిముఖినీ, విక్రమకేసరినీ కూడా బంధిం చుంటారా?

వాళ్లిద్దరి సంశయం తొలగి పోయేట్టు మరుక్షణంలోనే శిఖిముఖీ వాళ్లు పడు కున్న గుడారం వైపు నుంచి ఎర్రగండు అరుపూ, మనుషుల కేకలూ వాళ్లకు వినిపించినై. అక్కడ కొద్ది క్షణాలసేపు గందరగోళం లేచి సద్దు మణిగిపోయింది. అంతవరకూ ఆ దిక్కుకేసి చూస్తున్న ఆట వికుడు తృప్తిగా తలాడించి, తన పక్కన ఉన్న వాళ్లతో, ఈ ఇద్దరినీ అక్కడికి

మోసుకురండి! అంటూ గుడారం ఉన్న చోటుకు కదిలాడు.

అజితవీరభద్రులున్న వలను ఇద్దరు ఆటవికులు కర్రకు వేలాడగట్టుకుని గుడారం దగ్గిరకు వచ్చి దింపారు. శిఖి ముకి చేతులనూ, విక్రమకేసరి చేతులనూ తాళ్లతో బంధించి ఇద్దరాటవికులు పట్టుకుని నిలబడి ఉన్నారు. ఎర్రగండు వలలో బంధించబడి ఉన్నది.

'వాళ్లిద్దరినీ వలలో నుంచి బయటకు లాగి, వాళ్ల చేతులకు తాళ్లు బిగించండి. కుక్కను మాత్రం వలలోనే ఉంచి, కర్రకు వేలాడగట్టి భుజాన వేసుకు రండి. జాగ్రత్త, ఇది ఇప్పటికే మనవాళ్లిద్దరి గొంతులు కొరికింది,' అన్నాడొక ఆటవికుడు. వాడు వాళ్ల నాయకుడు.

'ఆ కంచరగాడిదల సంగతేమిటి, దొరా?' అని అడిగాడొక ఆటవికుడు.

'కులపెద్దకు బహూకరిద్దాం. ఇంత మంచి జాతి కంచరగాడిదలు దొరకవు,' అన్నాడు ఆటవిక నాయకుడు.

అంతవరకూ దీన్ని నిశ్శబ్దంగా చూస్తూ ఊరుకున్న శిఖిముఖి పెద్దగా గొంతెత్తి అధికారం ఉట్టిపడే స్వరంతో, 'మీరెవరో మాకు తెలియదు. మేము మా మహారాజును వెతుక్కుంటూ ఈ ప్రాంతాలకు వచ్చాం. హఠాత్తుగా దొంగల్లా మామీదపడి మమ్మల్ని బంధించారు. ఇందుకు మీరు తప్పక ప్రతిఫలం అనుభవిస్తారు,' అన్నాడు.



'ఈ బెదిరింపులూ, జడిపింపులూ మా కులపెద్ద వద్ద చేద్దువు గాని. కాళీమాతకు ప్రసాదం అయే ముందుగా మీ అందరితో మాట్లాడేందుకు చాలా సమయం అవకాశం ఉంటుంది,' అంటూ ఆటవికుల నాయకుడు వికవిక నవ్వాడు.

'మీది గోల్‌భరా గ్రామమా? మీరు ఇభ్యుజాతివాళ్లా? మేం అక్కడికి వచ్చేందుకే బయలుదేరాం. కట్లు విప్పండి. మీ వెంట వస్తాం,' అన్నాడు శిఖిముఖి.

'అదృష్టం కొద్దీ మీరెక్కడికి బయలుదేరిందీ మాకు ముందే తెలిసింది. అంతేకాక మీరెంత ప్రమాదకారులో కూడా విన్నాం. నువ్వన్నట్లు మేం ఇభ్యుజాతి వాళ్లమే. ఇక మాట్లాడకుండా వెంట రండి,' అంటూ

ఇభ్యుల నాయకుడు తన అనుచరులను హెచ్చరించాడు.

అందరూ నదిని చేరి అక్కడ సిద్ధంగా ఉన్న తెప్పలమీద ఎక్కి నది దాటి సూర్యోదయం వేళకు గోల్‌భరా గ్రామం చేరారు. గ్రామంలోని ఇభ్యుజాతి వాళ్లంతా వీధుల్లో చేరి శిఖిముఖీ వాళ్లను వింతగా చూడసాగారు. గ్రామం మధ్య ఉన్న ఒక విశాలమైన చుట్టు గుడిసెను చేరగానే ఇభ్యుల నాయకుడు తన అనుచరులను గుడిసె ద్వారం దగ్గర ఆగమని చెప్పి, శిఖిముఖీ వాళ్లతో లోపలికి వెళ్లాడు.

గుడిసెమధ్య గల ఒక ఎత్తయిన ఆసనం మీద ఇభ్యుల కులపెద్ద కూర్చుని ఉన్నాడు. అతడు బాగా వృద్ధుడు. వెడల్పాటి ముఖం, పెద్ద కళ్లూ, పొడవాటి మీసాలూ.. అతడు చూడటానికి భయం కొల్పేటట్టున్నాడు. అతడి వెనుకగా ఇభ్యుజాతి మాంత్రికుడు నిలబడి ఉన్నాడు. దిగువన ఒక ముక్కాలిపీట మీద తృప్తిగా చిరునవ్వు నవ్వుతూ శిథిలాలయ పూజారి కూర్చుని ఉన్నాడు.

'పూజారి కుక్క ఇక్కడున్నదా? ఆశ్చర్యం!' అన్నాడు శిఖిముఖి హేళన చేస్తున్నట్టు.

'మిమ్మల్ని శిథిలేశ్వరికి బలిపెట్టవలసిన పని ఉంది గదా? అందుకు వచ్చాను,' అన్నాడు పూజారి. 'ముందు కాళీమాతకు బలి ఇచ్చిం తరవాత, ఆ ఎంగిలి ప్రసాదాన్ని నువ్వేమైనా చేసుకో, తెలిసిందా?' అంటూ ఇభ్యుజాతి మాంత్రికుడు కోపంగా పూజారి కేసి కళ్ళురిమాడు.

'శాంతించండి!' అంటూ ఇభ్యుల కులపెద్ద చేయి ఊపి, శిఖిముఖీ, విక్రమకేసరుల కేసి నిశితంగా చూస్తూ, 'మీ నలుగుర్నీ బలిచేయాలని నాకు లేదు. మీలో నాయకుడెవరు? వాణ్ణొకణ్ణే కాళీమాతకు బలిపెడతాను. తతిమ్మా వాళ్ళు స్వేచ్ఛగా తిరిగి పోవచ్చు. నాయకుడెవరో ముందు చెప్పండి?' అన్నాడు. – (ఇంకా ఉంది)



# తాబేలూ! మళ్లీ నీదే గెలుపు!

కుందేలు మళ్లీ తాబేలు వద్దకు వచ్చి తనతో పరుగు పందెంలో పాల్గొనాలని సవాలు చేసింది. తన పూర్వీకురాలు తాబేలుతో పరుగుపందెంలో ఓడిపోయి మొత్తం కుందేటి జాతికే తీరని అవమానం తెచ్చిపెట్టిందని, ఎలాగైనా ఈసారి పందెంలో గెలిచి తన జాతి పరువును నిలబెడతానని చెప్పింది కుందేలు. తాబేలు అంగీకరించింది. ఒక రోజు అడవిరాజైన సింహం కుందేలుకు, తాబేలుకు మధ్య పరుగుకు జెండా ఊపింది. కుందేలు వేగంగా పరుగెత్తి గమ్యానికి నూరు అడుగుల దూరానికి వచ్చి, ఊపిరి పీల్చుకోవడానికి అక్కడే ఆగిపోయింది. తాబేలు తను ఉన్న చోటికి రాగానే తాను పరుగుపందెం పూర్తి చేయగలనని అది భావించింది. కాని అలసిపోయిన కుందేలు అక్కడే పడుకుని గాఢంగా నిద్రపోయింది. కాస్సేపయ్యాక తాబేలు అక్కడికి చేరుకుంది.

తాబేలు కుందేలును నిద్ర లేపి, 'నీవేం చేస్తున్నావు? మీ జాతి పూర్వీకురాలు మీకెంత అవమానం తెచ్చిపెట్టిందో మర్చిపోయావా? నీవు కూడా మళ్లీ నిద్రపోతే నీ జాతి కొత్త తరం ఎంత అవమాన భారాన్ని మోయవలసి ఉంటుందో కదా? లే. లేచి మిగతా దూరం కూడా పరుగెత్తు. నేను కూడా వెన్నంటే వస్తాను,' అంది తాబేలు. కుందేలు నిర్ఘాంతపోయి, 'తాబేలన్నా, నీవు గెలిచే స్థితిలో ఉన్నప్పటికీ నన్ను ఎందుకు లేపినట్లు?' అని అడిగింది.

అందుకు తాబేలు, 'పరుగుపందెంలో గెలుపోటములు పెద్ద విషయం కాదు. మేం నిదానస్తులమని లోకమంతటికీ తెలుసు. కాని నీ విషయం అలా కాదు. అతి వేగం కలిగిన జంతువుల్లో ఒకటిగా ఉండి కూడా తాబేలు చేతిలో ఓడిపోయి మీ జాతి నేటికీ ఎంత అవమాన భారం మోస్తున్నదో నాకు తెలుసు. మీ జాతిని మళ్లీ అలాంటి పరాభవంలోకి నెట్టివేయకూడదని అనుకుంటున్నాను,' తాబేలు మాటలు పూర్తి కాగానే, కుందేలు దాన్ని కౌగలించుకుని ఉద్వేగంతో, 'తాబేలన్నా, ఈసారి కూడా నీవే గెలిచావు' అన్నది. – అరుణ్ శ్రీవాత్సవ





# నమ్మదగిన కల

పూర్వం ఇంద్రప్రస్థనగరంలో ఒక గొప్ప ధనికుడుండేవాడు. కొంత కాలం సుఖా లలో మునిగి తేలినాక, ఆయనకు రోజులు కలిసిరాక, ఉన్న ఆస్తి యావత్తూ పోయింది. ఒకప్పుడు గొప్పగా బతికిన వాడు కాస్తా ఇప్పుడు పూర్తిగా బీదవాడైపోయాడు.

ఈ స్థితిలో ఉండగా ఆయనకు ఒక రాత్రి నిద్రలో ఒక కల వచ్చింది. ఆ కలలో ఆయనకు శ్రీ మహావిష్ణువు కనిపించి, 'నువు వెంటనే బయలుదేరి పాటలీపుత్ర నగరానికి వెళ్లు. అక్కడ నీకు డబ్బు దొరు కుతుంది. దానితో నువు తిరిగి ధనికుడవై సుఖపడగలవు!' అని చెప్పాడు.

కలలో శ్రీమహావిష్ణువు చెప్పిన మాట లలో గురి కుదిరి ఆ నిర్భాగ్యుడు ఒంట రిగా కాలినడకను ప్రయాణం చేసి చాలా రోజులకు పాటలీపుత్ర నగరం చేరుకు న్నాడు. అసలే ఆయనకు ఆ నగరం కొత్త. దానికి తోడుగా ఆయన నగరంలోకి ప్రవే శించేసరికి బాగా చీకటి పడింది. అమా వాస్య రోజులు కావడం చేత ఆకాశాన చంద్రుడు కూడా లేడు.

అందుచేత ఆయన ఎలాగో ఒక గుడి చేరుకుని ఆ గుడి మంటపంలో పడుకుని కొద్ది సేపట్లో నిద్రపోయాడు. నగరమంతా మాటుమణిగిన కొంతసేపటికి ఆ గుడిని ఆనుకుని ఉన్న ఒక ఇంట దొంగలు ప్రవే శించారు. ఆ ఇంటి యజమాని అలికిడి విని నిద్రలేచి, 'దొంగలు! దొంగలు!' అని గొంతెత్తి అరిచాడు. క్షణంలో చుట్టుపక్కల వారంతా వచ్చారు. దొంగల ఆట కట్టి యింది. వారు గోడమీదినుంచి గుడి ఆవ రణ లోకి దూకి మంటపం పక్కగా పరుగు తీసి చీకటిలో అంతర్థానమైనారు. వారిని

డి. సుశీల కుమారి

తరుముకుంటూ వచ్చిన జనం గుడి ఆవరణ అంతా వెతికి, చివరకు మంటపంలో నిద్రపోతున్న పరదేశిని పట్టుకుని చేతులు కట్టి తలారి వద్దకు లాక్కుపోయారు.

దూరప్రయాణం చేసి మట్టికొట్టుకుని ఉన్న ఆ పెద్ద మనిషి తలారికి దొంగలాగే కనిపించాడు. ఆయన ఆ పరదేశిని తన భటుల చేత బాగా తన్నించి, 'నిజం చెప్పు! ఎవరు నీవు? ఎందుకు దొంగతనానికి వచ్చావు?' అని అడిగాడు.

'అయ్యా, నేను దొంగను కాను. మాది ఇంద్రప్రస్థం. నేను ఒకప్పుడు బాగా బతికిన వాణ్ణి. భగవంతుడు రెండుసార్లు నన్ను మోసగించాడు. మొదట నాకున్న ధనమంతా పోగొట్టాడు. అంతటితో తృప్తితీరక, శ్రీమన్నారాయణ మూర్తి రూపంలో కలలో కనిపించినన్నీ పాటలీపుత్రానికి వెళ్లమనీ, ఇక్కడ నాకు ధనం దొరుకుతుంది అని చెప్పాడు. ఆ మాటలు నమ్మి ఎంతో శ్రమపడి ఇంద్రప్రస్థనుంచి ఇక్కడిదాకా నడిచి వచ్చి ఈ రాత్రే చేరాను. వచ్చి నాలుగు ఘడియలైనా కాకముందే తమచేత తన్నులు తిన్నాను!' అన్నాడు పరదేశి.

ఈ మాటలు విని తలారి నవ్వి, 'ఓయి పిచ్చివాడా! ఎవరైనా కలలను నమ్ముతారా! కొద్ది కాలం కిందట నాకుకూడా కలలో శ్రీమన్నారాయణ మూర్తే కనిపించి, మీ ఇంద్రప్రస్థంలోనే ఫలాని ఇంటివెనక ఫలాని చెట్టు కింద తవ్వితే గొప్ప నిధి దొరుకుతుందన్నాడు. నేనా మాటలు నమ్మి ఇంద్రప్రస్థం వెళ్లలేదే! కనుక నువ్వు ఇలాటి పిచ్చి నమ్మకాలు మాని హాయిగా ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్లు!' అని సలహా ఇచ్చాడు.

డబ్బు పోగొట్టుకున్న ధనికుడు వెంటనే బయలుదేరి ఇంద్రప్రస్థానికి వెళ్లాడు. ఆయన తలారి చెప్పిన గుర్తులను బట్టి ఒక చెట్టుకింద తవ్వి చూడగా నిజంగానే పెద్ద నిధి దొరికింది. దానితో ఆయన తిరిగి ధనవంతుడై సుఖంగా ఉన్నాడు. ఈ విధంగా ఆయనకు వచ్చిన కల నిజమయింది.



# చెడ్డ శిష్యుడు

ఒక రాజ్యంలో పేరు మోసిన వస్తాదు ఒకడుండేవాడు. అతడి దగ్గిర మల్లవిద్య నేర్చుకునేందుకు అనేక ప్రాంతాల నుంచి యువకులు వస్తుండేవారు. వస్తాదుకు నూట నలభై ఒక్క కుస్తీ పట్లు తెలుసు. వాటిలో నూట నలభై పట్లను తన శిష్యుల్లో మంచివాడని భావించినవాడి కొకడికి నేర్పాడు. కొన్నాళ్ల తరవాత ఆ శిష్యుడు రాజుగారి దగ్గరకు పోయి, 'మహారాజా! రాజ్యంలో నన్ను మించిన వస్తాదు మరొకడు లేడు. ఆఖరికి నాకు విద్య చెప్పిన గురువునైనా సరే ఓడించగలను. కాని, ఆయన ముసలివాడు కావడం వల్లా, నాకు విద్య నేర్పిన వాడవటం వల్లా కృతజ్ఞత కొద్దీ ఆయనమీద సవాలు చేయదలచలేదు,' అన్నాడు.

శిష్యుడి మాటలు వింటూనే రాజుగారికి మండిపోయింది. అంత విద్య నేర్పిన గురువుపై కృతజ్ఞతాభావం లేనందుకు అతణ్ణి కోప్పడి, 'అయినా, నీ మాటల్లో ఉన్న నిజం ఎంతో తెలిసిపోతుంది. మీ ఇద్దరికీ కుస్తీ ఏర్పాటు చేశాను,' అన్నాడు.

గురుశిష్యుల కుస్తీ చూసేందుకు చాలామంది జనం వచ్చారు. యువకుడూ, బలశాలీ అయిన శిష్యుడు ఏనుగుపిల్లలా ముసలి గురువు మీదికి దూకాడు. గురువుకు తను బలంలో శిష్యుడికి తీసికట్టని తెలుసు. అందువల్ల అతడు శిష్యుడికి నేర్పకుండా వదిలిన ఆ ఒక్క కుస్తీపట్టు ప్రయోగించి, అతణ్ణి గాలిలోకి ఎత్తి దూరంగా విసిరివేశాడు.

'ఈ పట్టు నువ్వు నాకు నేర్పలేదు. ఇది అన్యాయం!' అన్నాడు శిష్యుడు, పడ్డ చోటు నుంచి లేచి మన్ను దులుపుకుంటూ.

'ఇలాంటి సమయం రావచ్చనే దాన్ని నీకు నేర్పలేదు,' అన్నాడు ముసలిగురువు. రాజూ, చూడవచ్చిన ప్రజలూ గురువును మెచ్చుకున్నారు.





# యుద్ధ తంత్రం

కళింగ దేశాన్ని పరిపాలించే చంద్రహాసుడు విహార యాత్రకు రాజధానికి సమీపాన ఉన్న అరణ్యానికి సపరివార సమేతంగా వెళ్ళాడు. అతని వెంట కొద్ది మంది సైనికులు, ఆస్థానోద్యోగులు కూడా ఉన్నారు. విహార యాత్ర ముగించుకుని చంద్రహాసుడు రాజధానికి తిరుగు ప్రయాణమై వెళ్తుండగా మార్గమధ్యంలో వారికో పెద్ద పులి ఎదురుపడింది. దాన్ని చూసి రాజుతో సహా బృందమంతా స్థాణువులై నిల్చుండిపోయారు. తేరుకున్న మహారాజు ఆ క్రూరమృగాన్ని ఎదిరించడానికి ఇద్దరు సైనికుల్ని నియుక్తపరచవలసిందిగా సేనాధిపతిని ఆదేశించాడు.

అదివిన్న మహామంత్రి పద్మసంభవుడు సేనాధిపతిని కళ్లతో వారించి మహారాజుతో ఏకాంతంగా, 'ఆ మృగాన్ని సైనికులకు బదులు మీరే ఎదిరించడం ఉత్తమం,' అని సలహా ఇచ్చాడు. మహామంత్రి సలహా వెనుక ఏదో ఆంతర్యం దాగి ఉంటుందని నమ్మిన మహారాజు అతని సలహా మేరకు పెద్దపులిని ఎదిరించడానికి ఉద్యుక్తుడై ఓ సైనికుని చేతిలోంచి బల్లెం తీసుకున్నాడు. వీరుడైన చంద్రహాసుని ధాటికి ఎక్కువ సమయం నిలువలేక తోకముడిచి అడవిలోకి పారిపోయింది గాయపడ్డ మృగం.

తమని కాపాడేందుకు మహారాజు ప్రదర్శించిన ధైర్యసాహసాలను ప్రత్యక్షంగా చూసిన రాజపరివారం రాజధానికి చేరుకున్న తర్వాత తమ బంధుమిత్రులందరికీ ఈ విషయాన్ని గొప్పగా చెప్పసాగారు. అలా ఆనోటా, ఈనోటా ఈ సాహస కృత్యం జనులందరి నోళ్లలోనూ నాని మహారాజు కీర్తి ఇనుమడించింది. ప్రజలను కంటికి రెప్పలా కాపాడుకుంటాడన్న కీర్తి రాజుకి దక్కింది.

కొంతకాలానికి పొరుగునున్న వంగదేశానికి రాజైన శూరసేనుడు కళింగ దేశంపై

ఎమ్. మురళీ మోహన్



కలవడానికి అతని ఏకాంత మందిరానికి వెళ్ళాడు. చంద్రహాసుని కలిసి, 'మహారాజా, యుద్ధరంగంలో మన సేనల్ని ముందుండి నడిపించాల్సిన బాధ్యత మీకెంత ఉందో, ప్రజలను కంటికి రెప్పలా చూసుకునే మీ ప్రాణాలకు ఎట్టి హాని కలగకుండా రక్షించ వలసిన బాధ్యత మన సేనకూ ఉంది. కాబట్టి యుద్ధరంగంలో మీరు అనాలోచితంగా వ్యవ హరిస్తూ ముందు ముందుకి విజృంభిస్తూ మీ ప్రాణాలకు ముప్పు కొని తెచ్చుకోక మీ గమనంపై నియంత్రణ కలిగి ఉండాలి,' అంటూ సూచించాడు.

ఆ రోజు అడవిలో క్రూరమృగాన్ని ఎది రించడానికి సైనికులను పంపబోతే వద్దని వారించి, తనని పోరాడమని చెప్పిన మహా మంత్రే ఇప్పుడు తను యుద్ధరంగంలో సాధారణ సైనికుల కంటే ముందుంటే నియంత్రణ వారించడం అసహజంగా తోచింది చంద్రహాసునికి. అదే విషయాన్ని ఆయనతో చెప్పి, 'ఒకే విధమైన రెండు సందర్భాల్లోనూ ప్రతిస్పందించే తీరులో ఈ భేదం ఎంతవరకూ సమంజసం మంత్రి వర్యా?' అంటూ సందేహం వెలిబుచ్చాడు.

అందుకు మహామంత్రి పద్మసంభవు డిలా సమాధానం చెప్పాడు. 'మహారాజా! సందర్భాలు రెండూ ఒకేలాంటివైనా వాటి మధ్య సూక్ష్మభేదం ఉంది. ఆ రోజు అడవిలో మనకెదురుగా ఉన్నది క్రూర జంతువు. దానికంటూ నియమిత పోరాట రీతులూ, యుద్ధనియమాలూ లేవు. కానీ మన సైని కులు మాత్రం నియమిత రీతుల్లో మాత్రమే సుశిక్షితులు క్రూర జంతువును ఎదుర్కొవా

యుద్ధం ప్రకటించాడు. సంధి ప్రయత్నా లన్నీ విఫలమై యుద్ధం అనివార్యమైంది.

మొదటి రోజు పోరు భీకరంగా సాగింది. మహారాజు స్వయంగా యుద్ధంలో పాల్గొని శత్రుసేనల్ని చీల్చి చెండాడాడు. మరునాటి యుద్ధతంత్రాన్ని రచించాలనుకున్న పద్మ సంభవుడు సేనాధిపతితో ఆరోజు యుద్ధ విశేషాలు చర్చించసాగాడు. అప్పుడు సేనాని మంత్రితో, 'మహామంత్రీ! ఈ రోజు యుద్ధ భూమిలో మహారాజు పరాక్రమాన్ని కను లారా చూడవలసిందే గానీ వర్ణించనలవి కాదు. సామాన్య సైనికుల కంటే కూడా ఉరకలేస్తూ ఆయన ప్రదర్శించిన నైపుణ్యం అమోఘం, మనకు విజయం తథ్యం!' అని వ్యాఖ్యానించాడు.

సేనాధిపతి మాటలు విన్న మహామంత్రి సాలోచనగా తలపంకిస్తూ మహారాజుని

లంటే వీరు పొందిన శిక్షణ, ధరించిన ఆయుధాలుంటే సరిపోదు. దాన్నెదిరించే గుండె ధైర్యం కూడా ఉండాలి. అది ఆక్షణంలో మన సైనికుల్లో లోపించింది. మీ ఆజ్ఞను ధిక్కరించలేక ఆ మృగాన్ని వాళ్లు ఎదిరించ పూనుకున్నా, మీ ప్రాణాల కోసం వారి ప్రాణాలు ఫణంగా పెట్టారన్న అపఖ్యాతి మీకు పర్యవసానంగా దక్కి ఉండేది. అలా కాకుండానే మిమ్మల్నే ఎదిరించమని సూచించాను.

నేను ఊహించినట్లే ఆనాటి మీ సాహసం నేటికీ ప్రజలనోట వీరగాథగా చెప్పబడుతూ మీ కీర్తిని ఇనుమడింపజేస్తోంది. ఇక ఈనాటి యుద్ధం విషయానికొస్తే మన సైనికులు తలపడాల్సింది, తమలాంటివారే అయిన శత్రుసైనికులతో. కాబట్టి ఆనాటి సహజ భయం ఇప్పుడు వీరిలో లేదు. అందునా ఆనాటి సంఘటనల వంటి పలు ఇతర సంఘటనల ప్రభావం వారిపై ఎంతో ఉంది. ఆ ప్రభావం రాజుగా మీపై భక్తి, విశ్వాసాలనే కాదు, ప్రభువుగా ప్రేమాభిమానాలను పెంచుకునేలా చేసింది. మీవంటి ప్రభువులను కాపాడుకోవడం కోసం వారు ప్రాణాలను సైతం లెక్కచేయరు. అట్టి సైనికులను మీరు మార్గదర్శిగా ఉంటూ నడిపించాలి. మీ ప్రాణాలెంతో అమూల్యమైనవి కనుక ముందుకు దూకి శత్రువు పన్నిన వలలో మీవంటి వారు చిక్కుకుని ఆపదలు కొని తెచ్చుకోవడం సైన్యానికీ, రాజ్యానికీ శ్రేయస్కరం కాదు. కాబట్టి సాధారణ సైనికులు ముందుండగా వారిని నడిపించడం మీ బాధ్యత. మీ ప్రాణాలకు రక్షణ కవచంలా ఉంటూ ముందుకు సాగడం సైన్యం కర్తవ్యం,' అంటూ విడమర్చి చెప్పాడు.

మహామంత్రి సూచనలు, సలహాలు వెనుక ఇంతటి అర్థమున్నదని తెలుసుకున్న చంద్రహాసుడు, 'మంత్రివర్యా, మా క్షేమాన్ని చూసుకోడానికి మీ వంటి విజ్ఞులుండటం మా అదృష్టం,' అంటూ నమస్కరించాడు.

యుద్ధం ముగిసింది. పద్మసంభవుడి యుద్ధతంత్రాల ముందు శత్రుమూకలు పరాజయం పాలవ్వగా విజయలక్ష్మి చంద్రహాసుని వరించింది.





# హరిహరుడు

ఈ నెల చందమామలో శివ విష్ణు తత్వంపై నారద మహర్షి చింతన గురించిన ఒక ఆసక్తికరమైన కథనాన్ని ప్రచురిస్తున్నాము. హరి హరులు ఏక రూపులని, ఇది హైందవమతంలో పరమోన్నత రూప మని ఈ కథనం తెలుపుతుంది.

ఈ సంచిక ముఖచిత్రం శ్రీ ఎంటివి ఆచార్య గారు గీసినది. ఇది 1951 నవంబర్ నెలలో తొలిసారిగా ముద్రించబడింది. 1949 జనవరి నుంచి 1952 జూన్ వరకు చందమామలో శ్రీ కృష్ణుడి లీలలు గురించిన చిన్న కథలను వరుసగా ప్రచురించాము. ఈ కథలు ఒక క్రమ పద్ధతిలో లేనప్పటికీ, కృష్ణావతారం గురించిన వివిధ అంశాలను ఈ చిత్రాలు స్పృశించాయి. ఈ చిత్రాలన్నింటినీ ఆచార్య గారే వేయడం ఆసక్తికరమైన విషయం. ఈనెల ప్రచురిస్తున్న ముఖచిత్రం నారదుడి ద్వారకాపురి సందర్శనను వర్ణిస్తుంది.

''దుష్ట రాక్షసుడైన నరకుణ్ణి హతమార్చివేశాడు కదా శ్రీకృష్ణుడు. ఆ తరవాత పరమాత్ముడు పదహారువేలమంది గోపికలను ఒక్కసారిగా పెళ్లాడినాడనటం! ఎంత వింత!! ఎటువంటి విడ్డూరం!!!'' ఈ వార్త చెవిన పడగానే, చిత్రమేమిటో చూచివద్దామని త్రిలోక సంచారి అయిన నారద మహర్షికి కుతూహలం కలిగింది. వెంటనే ఆయన బయల్దేరి వెళ్లి అతివైభవంతో ప్రకాశిస్తూ ఉండే ద్వారకాపురి చేరుకున్నాడు. సంతోషాంతరంగులై ఉన్న రుక్మిణీ కృష్ణులను సందర్శించాడు.

కృష్ణుడు దిగ్గున లేచి, మహర్షికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించాడు. కుశల ప్రశ్నలైన తరువాత నారదుడు 'ఓ సర్వలోకనాయకా! లోక క్షేమం కోసమని నీవు అవతారమెత్తుతావన్న సంగతి నాకు ముందే తెలుసు. సంసార కూపంలో పడిపోయినవారికి పట్టుకొమ్మై ముక్తినిచ్చే నీ పాద యుగమే నాకు లభించింది. ఇంత కంటే ఏం కావలె!' అని స్తుతించి సెలవు తీసుకుని ఒక గోపిక ఇంటికి వెళ్లాడు. అక్కడ గోపికతో ముచ్చటిస్తూ, తాంబూల చర్వణం చేస్తూ ఉన్న కృష్ణుడు లేచి వచ్చి మహర్షికి అర్ఘ్యపాద్యాదులిచ్చాడు.

నారదుడు అమితాశ్చర్యం పొందాడు. తనివితీరక, విడివిడిగా గోపికల గృహాలు ఇంకా చూడా లనుకున్నాడు. ఒక గోపిక ఇంట్లో గానలోలుడైన మురళీ కృష్ణుడు దర్శనమిచ్చాడు మహర్షికి. మరొక ఇంట్లో బిడ్డలనెత్తుకుని ముద్దాడుతున్న ప్రేమమూర్తి కృష్ణుడు అగుపించాడు. ఇంకొక గృహానికి పోగా ఉద్ధవునితో పాచికలాడుతూ క్రీడాసక్తుడైన శ్రీకృష్ణుడు కనబడ్డాడు. మరొకచోట తీర్పులు తీరుస్తున్న న్యాయాధిపతి కృష్ణుడు అగుపించాడు. ఇంకొక ఇంటిలో బ్రాహ్మణోత్తము లకు మృష్టాన్నములు వడ్డిస్తున్న లీలామానుష విగ్రహుడైన కృష్ణుడు అగుపించాడు.

ఏకకాలమందే ఇన్నిరూపులతో ప్రత్యక్షమైన ఆ పరమాత్మునికి నమస్కరించి, 'దేవాదిదేవా! నీ యోగమాయావిలాసాన్ని కనుక్కోవటం ఎవళ్ల తరమూ కాదు. నీ పాదపరిచర్యా మహిమవల్ల నేనొక్కడినే తెలుసుకోగలిగాను. పరమపావనమైన నీ లీలలు పాడుకుంటూ లోకాలు సంచరిం చుకుపోతాను అనుజ్ఞ ఇవ్వు,' అంటూ సెలవు తీసికొని ఆనందంతో మరలిపోయాడు నారదుడు.



అలాగే, ఈ ఫిబ్రవరి నెలలో అట్టచివరి బొమ్మగా నారదుడు దర్శిస్తున్న శివతాండవ దృశ్యాన్ని ప్రచురిస్తున్నాము. చందమామ చిత్రకారులు శ్రీ వడ్డాదిపాపయ్య గారు 1973 మార్చి చందమామలో ఈచిత్రం గీశారు. శివపురాణంలో భాగంగా వచ్చిన ఈ అద్భుత చిత్రాన్ని అట్టచివరి బొమ్మగా వేశారు.

ఈ విశిష్ట నృత్యంలో పరమశివుడు బ్రహ్మ విష్ణువులతో ఐక్యమవుతాడు. ఆ సమయంలో అక్కడున్న భరత ముని ఈ నృత్య విశేషాలను పొందుపర్చినందున దీనికి భరత నాట్య శాస్త్రం అని ప్రసిద్ధికెక్కింది. భరతనాట్యం భారతదేశంలోని అన్ని శాస్త్రీయ నృత్యాలకు మూలం. ఇది నాట్యం (ధర్మ), నృత్యం (రస మరియు భావం) మరియు నృత్తం (స్థల కాలాల్లో శరీరాన్ని తాళ, లయబద్ధంగా కదల్చడం) వంటివాటితో కూడి ఉంటుంది. ఈ సకల ప్రపంచం, దేవతలు కూర్చిన లయతో స్పందిస్తూ ఉంటుందని నమ్మిక. దక్షిణ భారతీయ హిందూ దేవాలయాల్లో షట్కోణ యంత్రం సాధారణంగా దర్శనమిస్తుంటుంది. ఇది హిందూ మతంయొక్క విశిష్ట అర్థాన్ని సూచిస్తుంది. దీని వెనుక పలు సిద్ధాంతాలు ఉన్నాయి.

- ఆలయాల్లో సాధారణంగా ఆరు పూజాకాలాలను నిర్వహిస్తుంటారు. ఉష:కాలం, ప్రాత:కాలం, మధ్యాహ్న కాలం, సాయంకాలం, రాత్రికాలం, అర్ధజాము. మీరు షట్కోణాన్ని ప్రమాణంగా తీసుకున్నట్లయితే ఆరు అంశాలను ఆరు కాలాలుగా పరిగణించవచ్చు. అలాగే వలయం చుట్టూ ప్రతిబింబించే రంగులు స్థలకాలాలకు చెందిన పూర్తి వలయంగా భావించవచ్చు.
- మరొక సిద్ధాంతం ప్రకారం షట్కోణ యంత్రంలోని ఊర్ధ్వ మరియు అధో భాగంలో ఉండే త్రికోణాలు సమాంతరంగా విభజించబడి ఉంటాయి ఇది శివ, శక్తి రూపాల నిర్దిష్ట సంగమం.
- మరొక సిద్ధాంతం ప్రకారం మండల సంకేతం అనేది మానవుడికి, దేవుడికి మధ్య సాధించబడిన ధ్యాన సమతుల్య స్థితిని తెలుపుతుంది.

పంచభూతాలు అపు(నీరు), వాయు(గాలి), అగ్ని(నిప్పు) పృథ్వి(భూమి) ఆకాశం(గగనం) అనేవి శివుడిలో భాగం. హిందూమతం ప్రకారం గ్రహాలు మరియు ప్రకృతి యొక్క ఐదు వ్యక్తీకరణల కలయికతో జీవం పుట్టింది. కొందరు భావిస్తున్నట్లుగా శివుడు ప్రళయకారుడు కాదు. కాని ఒకానొక కాలంలో అఖండ స్థలంలో జీవం పుడుతుంది మరియు గిడుతుంది. ఈ స్థలకాలాల అధినాయకుడే అఖండభావం.

ఈ సూత్రాలను పక్కన బెట్టి చూస్తే, మీరు వపాగారి అద్భుతమైన కళా సృష్టిని ఈ చిత్రంలో ఆస్వాదిస్తారని ఆశిస్తున్నాము. మీరు గమనించినట్లయితే ఈ చిత్రంలో ఆయన చిన్న పాటి సరదాను జోడించారు కూడా. ఈ విశ్వ నృత్యంలో శివుడు, ఇతర దేవతలందరూ నృత్యం చేస్తుంటారు. వినాయకుడు కూడా నాట్యం చేస్తూ ఉంటాడు. ఇక్కడే తన వాహనమైన మూషికం కూడా తన యజమానితో పదం కలుపుతూ నృత్యం చేస్తుంటుంది!

రాబోయే సంచిక వరకు, మా అట్ట చివరి బొమ్మను ఆస్వాదించండి. ఈ చిత్రంలో దాగిన అనేక ఆసక్తికరమైన అంశాలను మీరు కనుగొంటారని మా నమ్మకం. – సౌమ్యా భరద్వాజ్

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 37

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 37 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. మార్చ్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. మే 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ఫలాలు



1. పండు వెలుపల గింజలు ఉండే పండు పేరు ఏమిటి?
2. న్యూజిలాండ్ దేశీయ పక్షి పేరును కలిగిన పండు పేరు ఏమిటి?
3. ప్రపంచంలో చాలా ఎక్కువగా ఆరగించబడే పండు ఏది?
4. మన జాతీయ ఫలంగా పేరొందిన పండు ఏది?
5. ఆరోగ్యకరమైన కొవ్వు (హెచ్‌డిఎల్) ను సమృద్ధిగా కలిగిన పండు ఏది?
6. పండ్లలో రారాజు ఉన్నట్లుగా పండ్లలో రారాణి ఏది?
7. నిమ్మ పండులో ఉండే విటమిన్ ఏది?
8. పండ్లలో కనిపించే చక్కెర పేరేమిటి?

**చందమామ లోకజ్ఞానం క్విజ్-34 సమాధానాలు:**

1. పెలికాన్; 2. ఫ్లెమింగో; 3. పుల్మార్; 4. రుఫోస్; 5. హెరోన్
6. అల్బాట్రాస్; 7. హమ్మింగ్ బర్డ్

*November'11 Winner: Yagnesh Saradchandra Chaphalkar, Plot-12, Abhineet park,Pakhal Road, Nasik - 422006.*



# నవ్వుల పువ్వులు



రాజ్: రాహుల్! మానాన్న వేటగాడని నీకు తెలుసు కదా. తీరిక సమయంలో ఆస్ట్రేలియాలోని ధ్రువప్రాంత ఎలుగుబంట్లను వేటాడటం అంటే ఆయనకు ఇష్టం.

రాహుల్: కాని ఆస్ట్రేలియాలో ధ్రువ ప్రాంత ఎలుగుబంట్లు లేవు కదా.

రాజ్: మరి మా నాన్న వాటిని మొత్తంగా కాల్చేసాడుగా..



వింకీ: డాక్టర్, డాక్టర్ నా పరిస్థితి రేసుగుర్రంలా ఉందండీ.

డాక్టర్: అలాగా, ప్రతి నాలుగు దౌడులు తీశాక ఈ మాత్రలు వేసుకోండి.



కుమారుడు: అమ్మా, అమ్మా! నాకు బడికి వెళ్లాలని లేదు.

అమ్మ: నువు బడికి వెళ్లి తీరాల్సిందే. ఎందుకంటే కారణాలు. నీకు 55 ఏళ్లు వచ్చాయి. పైగా నువు స్కూల్ హెడ్మాస్టర్‌వి కూడా మరి.



రజిత మొదటిసారిగా బడికి వెళ్ళి తిరిగి వచ్చింది.

తండ్రి: ఏమ్మా, బడిలో నువు చాలా నేర్చుకున్నావు గదా?

రజిత: లేదు నాన్నా, నేను రేపు ఉదయం కూడా మళ్లీ బడికి పోవాలి.

# నోరూరించే కలకండ





ఈరోజుల్లో కలకండ చాలా రూపాలలో, కమ్మటి రుచులతో తయారవుతున్నాయి. మనం ముందుగా గుహల్లో నివసించిన మన పూర్వీకులకు కృతజ్ఞులమై ఉండాలి. ఎందుకంటే తేనెపట్టుల నుంచి తేనెను ముందుగా సేకరించి వాటిని కలకండలు తయారు చేయడానికి ఎండబెట్టినది వాళ్లే మరి.



చరిత్రలో మొదటిసారిగా భారతదేశం, ఇరాన్‌లలోనే కలకండ పుట్టింది. స్ఫటికంలా ఉండే కలకండలో చక్కెర స్ఫటికాలు ఉంటాయి. కలకండ స్ఫటికాన్ని టీలో కరిగించడం అనేది జర్మనీలోని టీ కల్చర్‌లో ఒక విడదీయరాని భాగం.



మొదట్లో కలకండ తీగలు గట్టిగా పొడవుగా ఉండి తెలుపురంగులో ఉండేవి. జర్మనీలో 1670లో ఒక క్రైస్తవ గాయకుడు వంచగలిగే మిఠాయి కాడలను తయారు చేయాలని నిర్ణయించుకున్నాడు. వంగే మిఠాయి కాడలను తయారుచేసి చర్చ్ సేవా సమయాల్లో వాటిని పిల్లలకు ఇచ్చేవాడు.



కొత్త మిఠాయి కాడలు:

1685లోనే, చక్కెర ముద్దతో ఫ్లాట్ కాండీలను తయారు చేయసాగారు. వీటిలో ప్రతి ఒకటీ ఒక పేపర్ ముక్కను కలిగి ఉంటాయి వాటిలో చిన్న చిన్న సందేశాలు కూడా ఉండేవి. ఇవి ఈనాటి అదృష్ట కుకీలను పోలి ఉండేవి. సీక్రెట్ చార్మ్స్ అనేది మరొక కాండీ రకం. కాండీ వివిధ రకాలు, రూపాలలో ఉండేది. ఎవరయినా వీటిని చప్పరించగానే దానిలో ఉండే రహస్య సందేశం పైకి కనిపించేది!



క్యాండీ ఫలాలు లేదా ఘనరూపంలోని ఫలాలు 14వ శతాబ్దం నుంచి ఉనికిలో ఉంటున్నాయి. మధ్య యుగాల్లో, ఈ మధుర ఫలాన్ని పోప్ చాలా ఇష్టపడేవారట. ఆతిథ్యం ఇచ్చేవారు తమ అతిథుల గదులలో ఒక జార్ నిండా క్యాండీ ఫలాలను ఉంచేవారట.ఎందుకంటే ఇవి ఆహారాన్ని బాగా జీర్ణం అయేలా చేస్తాయట.



విల్లీ వోంకాస్ కాండీలు రోల్డ్ దాల్స్ పుస్తకాలలో మాత్రమే కనబడాతాయని మీరనుకుంటున్నారా? విల్లీ వోంకా బ్రాండ్ నెస్టెల్ కంపెనీ యాజమాన్యంలో ఉంది. ఇది గోబ్‌స్టాపర్స్ మరియు వోంకా బార్స్ వంటి బ్రాండెడ్ ఉత్పత్తులను తయారు చేస్తోంది. గోబ్‌స్టాపర్స్ అనేవి వివిధ రకాల రంగుల పొరలతో కూడిన క్యాండీలతో తయారుచేయబడతాయి.



ఆధునికంగా మనం చూస్తున్న లాలీ పాప్‌ని జార్జ్ స్మిత్ అనే వ్యక్తి 1908లో కనుగొన్నాడు. గట్టిగా ఉండే క్యాండీపై పుల్లను గుచ్చితే దాన్ని చప్పరించడం సులువుగా ఉంటుందని అతడు ఆలోచించాడు. అలా తయారు చేసిన దానికి అతడు లాలీ పాప్ అని పిలిచాడు. అతడికి ప్రీతి పాత్రమైన గుర్రం పేరు లాలీ పాప్ మరి.

లాలీపాప్‌లను భారీ స్థాయిలో ఉత్పత్తి చేసిన తొలి యంత్రం నిమిషానికి 40 లాలీపాప్‌లను తయారు చేయగలిగింది. ఈ రోజుల్లో ఈ యంత్రాలు నిమిషానికి 5,900 లాలీపాప్‌లను తయారు చేస్తున్నవి.



కెండల్ మింట్ కేక్ అనేది గ్లూకోస్ ఆధారితమైన క్యాండీ. ఇది ఫ్లేవర్‌తో కూడిన పిప్పర్‌మెంట్. ఇది కొన్నిసార్లు చాకొలెట్‌తో పూత పూయబడి ఉంటుంది. కెండల్ మింట్ కేక్ ప్రత్యేతత ఏమిటి? పర్వతారోహకులు, పర్వతాలు ఎక్కేవారు తమతోపాటు కొన్ని మింట్ బార్లను తీసుకుని వెళ్లేవారు. ఎందుకంటే ఇవి బాగా శక్తిని ఇచ్చేవి. ఎవరెస్ట్ పర్వతాన్ని 1953లో తొలి సారి అధిరోహించినప్పుడు ఎడ్మండ్ హిల్లరీ, అతడి బృందం ఈ క్యాండీ బార్లను తమ వెంట తీసుకెళ్లారు.



చనిపోయినవారి గురించి వర్ధంతి జరుపుకునే సమయాల్లో, మెక్సికో డే రేజున పిల్లలు మనుషుల పుర్రెలను పోలిన క్యాండీలను తయారు చేస్తారు. వాటిని ఐస్‌తో నగలతో అలంకరిస్తారు. చక్కెరతో కూడిన ఈ పుర్రెలను పండుగలు ముగిశాక అందరూ ఆరగిస్తారు.



అమెజైకు ఒక జపాన్ క్యాండీ కళా పరిశ్రమ. ఆర్టిస్టులు తమ చేతులను, సిజర్స్‌ని, ట్వీజర్లను ఉపయోగించి బహు వర్ణాలతో కూడిన టాఫ్పీ ముక్కపై పనిచేసి, విశిష్టమైన పుర్రెలను తయారు చేస్తారు. పిల్లలు బాగా ఇష్టపడే జంతువులు, కీటకాలను ఆర్టిస్టులు ఎక్కువగా వేస్తుంటారు. కొంతమంది అమెజైకు కళాకారులు వీధుల్లో తమ కళ ప్రదర్శిస్తుంటారు. వీరు కాండీ క్రాఫ్ట్‌తో పాటు గారడీ విద్యలు చేస్తూ, కథలు చెబుతుంటారు.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | I am Sure. | It was fine. |
|---|---|---|
| Telugu | ఖచ్చితంగా | చాలా బాగుంది. |
| Hindi | मुझे विश्वास है।<br>ముజె విశ్వాస్ హై. | यह ठीक था।<br>యహ్ ఠీక్ థా. |
| Tamil | நிச்சயமாகத் தெரியும்.<br>నిచ్చయమాగా తెరియుమ్ | நன்றாக இருந்தது.<br>నన్‌రాగ ఇరున్‌దదు. |
| Bengali | আমি নিশ্চিত।<br>ఆమి నిశ్చిత్. | সেটা ভাল ছিল।<br>సెటా భలో ఛిలో. |
| Marathi | मला खात्री आहे.<br>మలా ఖాత్రి ఆహె. | ते चांगलं होतं.<br>తె చాంగలం హోతమ్. |
| Kannada | ನನಗೆ ಖಂಡಿತವಾಗಿ ತಿಳಿದಿದೆ.<br>ననగె ఖండితవాగి తిళిదిదె. | ಅದು ಚೆನ್ನಾಗಿತ್ತು.<br>అదు చెన్నాగిత్తు. |
| Oriya | ମୁଁ ନିଶ୍ଚିତ।<br>మున్ నిశ్చిత. | ମୁଁ ଭଲ ଅଛି।<br>మున్ భల అచ్ఛి. |
| Gujarati | મને ખાતરી છે<br>మనె ఖాతరీ చె. | તે સરસ હતું.<br>తె సరస్ హతున్. |
| Assamese | মই নিশ্চিত।<br>మొయి నిషిట్. | সেইটো ঠিকেই আছিল।<br>సైయిటు ఠికై ఆసిల్. |
| Malayalam | എനിക്കുറപ്പാണ്.<br>ఏనిక్కురప్పుమ్. | അത് നന്നായിരുന്നു.<br>అథునన్నాయిరున్ను. |
| Santali | ᱛᱟᱣᱠᱟ ᱜᱮᱭᱟ।<br>తావ్క గెయ్యా. | ᱱᱚᱣᱟ ᱵᱮᱥ ᱛᱟᱦᱮᱱ ᱠᱟᱱᱟ।<br>నొవ బెస్ తహెన్ కన. |
| Sanskrit | अहं निश्चयेन जानामि।<br>అహం నిశ్చయేన జానామి. | तद् उत्तमम् आसीत्।<br>తద్ ఉత్తమమ్ ఆసీత్. |





| English | Did you go alone? | I am very tired. |
|---|---|---|
| Telugu | మీరు ఒకరే వెళ్ళారా? | నేను బాగా అలసిపోయాను. |
| Hindi | क्या तुम अकेले गए थे?/ गईं थीं?<br>క్యా తుమ్ అకెలె గయె తె/గఈఁన్ థీన్. | मैं बहुत थक गया हूँ / गई हूँ।<br>మైన్ బహుత్ థక్ గయా హూన్/గఈ హూన్. |
| Tamil | நீ தனியாகப் போனாயா?<br>నీ తనియాగ పోనాయా? | நான் மிகவும் களைப்பாக இருக்கிறேன்.<br>నాన్ మిగవుమ్ కళైపాగ ఇరుకిరేన్ |
| Bengali | তুমি কি একা গিয়েছিলে?<br>టుమి కి ఎకా గియెచిలె? | আমি ভীষণ ক্লান্ত।<br>ఆమి భీషొన్ క్లాంటో. |
| Marathi | तू एकटा/एकटी गेला/गेली होतीस का?<br>తు ఎకటా/ఎకటీ గెలా/గెలీ హోతిస్ కా? | मी खूप थकलो/थकले आहे.<br>మీ ఖూప్ థకలో/థకలె ఆహె. |
| Kannada | ನೀವು ಒಬ್ಬರೇ ಹೋದಿರಾ?<br>నీవు ఒబ్బరే హోదిరా? | ನನಗೆ ತುಂಬಾ ಆಯಾಸವಾಗಿದೆ.<br>ననగె తుంబా ఆయాసవాగిదె. |
| Oriya | ତୁମେ ଏକୁଟିଆ ଯାଇଥିଲ କି?<br>తుమె ఏకుటియా జాయితిల కి? | ମୁଁ ଭାରି ହାଲିଆ ହୋଇପଡ଼ିଛି।<br>ముఁన్ భారి హాలియా హోయిపడిచ్చి. |
| Gujarati | તમે એકલા ગયા હતા?<br>తమె ఎకలా గయా హతా? | હું ખૂબ થાકી ગયો/ગઈ છું.<br>హూన్ ఖూబ తాకీ గయో/గయి ఛున్. |
| Assamese | তুমি অকলে গৈছিলা নেকি?<br>టుమి అకొలె గొయిసిలా నెకి? | মই বৰ ভাগৰুৱা।<br>మొయి బొర్ భాగరువ. |
| Malayalam | നീ ഒറ്റയ്ക്കാണോ പോയത്?<br>నీ ఒట్టక్కానో పోయతు? | എനിക്ക് വളരെ ക്ഷീണമുണ്ട്.<br>ఎనిక్కు వలరె క్షీణముండు. |
| Santali | ᱮᱠᱞᱚᱢ ᱥᱮᱱ ᱜᱚᱰᱚᱜ-ᱟ?<br>ఎక్లమ్ సెన్ గొడొగ్-అ? | ᱟᱰᱤ ᱞᱟᱝᱜᱟᱧ ᱵᱩᱡ ᱮᱫᱟ।<br>అది లంగంజ్ బుజ్ ఎడ. |
| Sanskrit | किं त्वम् एक:/एका एव अगच्छ:?<br>కిం త్వమ్ ఎకః/ఎకా ఎవ అగచ్ఛః? | अतीव श्रान्त:/श्रान्ता अस्मि।<br>అతీవ శ్రాన్తః/శ్రాన్తా అస్మి. |

# భారత దర్శిని

## జంతువులు, పక్షులను ప్రేమించండి



ప్రపంచ కప్ సీరీస్‌లో భారతదేశ విజయాన్ని అందరూ గొప్పగా జరుపుకున్న విషయం తెలిసిందే. అయితే మల్లి అనే రామచిలుక మాత్రం ఈ విజయోత్సవాలలో భాగం పంచుకోలేకపోయింది. ఎందుకంటే అది చనిపోయింది. 2011ప్రపంచ కప్‌లో పాకిస్థాన్ గెలుస్తుందని మల్లి జోస్యం చెప్పింది. కాని దాని అంచనా తప్పడంతో దాని సంరక్షకుడైన బాబా దాని తలరాత మార్చేశాడు. జ్యోతిష్కుడి వద్ద ఉండే చిలక ముమ్మారు తప్పు జోస్యం చెప్పిందంటే అది మహాపాపమని జనం నమ్మిక. అంతకు ముందు అనేకమంది తమ భవిష్యత్తుపై జోస్యం చెప్పించుకోవాలని బాబా వద్దకు వచ్చేవారు. అయితే తన చిలక తప్పు జోస్యం చెప్పడం వల్ల తన ఉపాధి పోతుందని భావించిన బాబా ఆ చిలుకను చంపేయాలని నిర్ణయించుకున్నాడు. మల్లి చావు గురించి విన్న అనేకమంది బాబా అభిమానులు అతడి వద్దకు మళ్లీ రావడానికి ఇష్టపడలేదు.

మల్లికి పట్టినగతి ఇతర చిలుకలకు పట్టదనే ఆశిద్దాము. జంతువులు, పక్షులపై క్రూరత్వం ప్రదర్శించడం నేరం.

## సరికొత్త నిరసన

ఈనెల మీకు ఓ సరికొత్త నిరసన పద్ధతిని తెలియజేస్తున్నాము. అవతార్ సింగ్ నగ్లా ఒక నీలగిరి చెట్టుపైకి ఎక్కి బలమైన కొమ్మపైభాగాన పడక తయారు చేసుకున్నాడు. తన కోరికలు నెరవేరేంతవరకు అక్కడే ఉండిపోవాలని నిర్ణయించుకున్నాడు. అతడిని సమర్థిస్తున్న వారు సమీపంలోని చెట్టుకింద ఒక గుడారం వేసుకుని అతడికి వేళకు ఆహారం అందించేవారు.

అవతార్ సింగ్ నగ్లా నిరసన అవినీతి మీదే మరి. నాలుగు దశాబ్దాలుగా పరిష్కారం కాని భూ వివాదంపై తాజా విచారణ జరపనిదే చెట్టు దిగి రావడానికి అతడు అంగీకరించ లేదు. అయితే ప్రభుత్వం మాత్రం ఈ వివాదం అప్పటికే పరిష్కరించబడిందని ప్రకటించింది. చెట్టు మీద నుంచి కిందికి దిగిరావాలని పాలనాధికారులు, పోలీసులు తీవ్రంగా ప్రయత్నించారు. కాని వారి ప్రయత్నాలన్నీ అతడి పట్టుదల ముందు దిగదుడుపే అయ్యాయి.



ముగింపు ఏదైనా కావచ్చు అవతార్ సింగ్ మటుకు కొత్త రికార్డును సాధించాడు మరి.

# కెరీర్ అంటే?




కౌన్సిల్ వివరాలు

భారత కంపెనీ సెక్రటరీల సంస్థ –ఐసిఎస్ఐ– భారత దేశంలో కంపెనీ సెక్రటరీల వృత్తిని క్రమబద్ధం చేస్తుంది. కంపెనీ కార్యదర్శిగా అర్హత సాధించడానికి ఇది మూడు దశల కోర్సును అందిస్తోంది. ఫౌండేషన్ కోర్సు 8 నెలలు. ప్లస్ టూ పరీక్ష తర్వాత దీంట్లో చేరవచ్చు. దీన్ని ముగించిన తర్వాత 9 నెలలకాలం సాగే ఇంటర్మీడియట్ కోర్సులో ఆసక్తి ఉన్నవారు చేరవచ్చు. కోర్స్ చివరలో తుది పరీక్షలు ఉంటాయి. వీటి తర్వాత అభ్యర్థులు ప్రాక్టికల్ శిక్షణకు వెళ్లవలసి ఉంటుంది. తరువాత అభ్యర్థులు ఐసిఎస్ఐ అసోసియేట్ సభ్యులుగా చేరడానికి అర్హులవుతారు. – సాయి

Website - www.icsi.edu

| Level | Eligibility | Minimum duration | Maximum duration | Papers |
|---|---|---|---|---|
| Foundation Programme | Class 12th pass | 8 months | Needs to be completed within 3 years of registration | 1. English and Business Communication<br>2. Economics and Statistics<br>3. Financial Accounting<br>4. Elements of Business Law and Management |
| Executive Programme | Clear Foundation Programme/ Graduates from all disciplines except Fine Arts can directly enrol | 1 year | Needs to be completed within 5 years of registration for the Executive Programme | Module I<br>1. General and Commercial laws<br>2. Company Accounts, Cost and Management Accounting 3. Tax laws<br>Module II<br>1. Company Laws<br>2. Economic and Labour Laws<br>3. Securities Laws Compliances |
| Professional Programme | Cleared Executive Programme | 1 year | Needs to be completed within 5 years of registration for the Executive Programme | Module I<br>1. Company Secretarial Practice<br>2. Drafting, Appearances and Pleadings<br>Module II<br>1. Financial, Treasury and Forex Management<br>2. Corporate restructuring and insolvency<br>Module III<br>1. Strategic Management, Alliances and International Trade<br>2. Advance Tax Laws and Practices<br>Module IV<br>1. Due Diligence and Corporate Compliance |

## విదూషకుడు

## బీర్బల్



# దేవుడికంటే గొప్పవాడు



1. ఒక రోజు అక్బర్ తన ఆస్థాన సభికులను ప్రశ్నించాడు 'దేవుడి కంటే గొప్పవాడు ఎవరు?' మొదట బీర్బల్ సమాధానమిచ్చాడు. 'షహన్‌షా, సందేహమెందుకు? మీరు దేవుడికంటే గొప్పవారు.'



2. కొంతమంది సభికులకు బీర్బల్ అంటే అసూయ. వారిలో ఒకరు లేచినిల్చుని చెప్పాడు. 'షహన్‌షా బీర్బల్ మిమ్మల్ని మునగచెట్టు ఎక్కిస్తున్నాడు. అదెలాగా వివరించమనండి!'



3. బీర్బల్ చెప్పాడు. 'దేవుడు కూడా చేయలేని పనిని మన చక్రవర్తి చేయగలడు.' ఆ సభికుడు తీక్షణంగా బీర్బల్ కేసి చూశాడు. బీర్బల్ డాంబికాలు పలుకుతున్నాడు.



4. 'మళ్లీ చెబుతున్నాను. దేవుడు ఒకపని చేయలేడు,' చెప్పాడు బీర్బల్. 'నీవు నన్ను సవాలు చేయాలనుకుంటున్నావా?' సభికుడు అందుకున్నాడు. 'దేవుడు అపవిత్రమైన పని చేయలేడు.'



5. బీర్బల్ ఎదుర్కొన్నాడు. 'దేవుడు అపవిత్రమైన పనులను చేయలేడు. కాని మన చక్రవర్తి మాత్రం అపవిత్రపని చేస్తాడని దాని అర్థమా?' సభికుడి నోట మాట రాలేదు.



6.బీర్బల్ అతడికేసి తీక్షణంగా చూశాడు. 'ఇకనుంచి నీ నోరు మూసుకుని ఉండు.' సభికుడు తీవ్ర అవమానానికి గురై సిగ్గుతో తల దించుకున్నాడు.



7. అప్పుడు చక్రవర్తి తన వంతుగా అందుకున్నాడు. 'బీర్బల్ నీవు ఇంతకుముందు చెప్పిన మాటలను రుజువు చేయలేదు మరి. నేను దేవుడి కంటే ఎలా గొప్పవాడినో చెప్పు?'



8. 'షహన్‌షా! మీరు ఎవరినయినా ద్వేషించినట్లయితే మీరు అతనిని రాజ్యం నుంచి నిషేధించగలరు. అయితే దేవుడు అలా చేయలేడు. కాబట్టి మీరు దేవుడి కంటే గొప్పవారు.'



9. చక్రవర్తి విరగబడి నవ్వాడు. ఆస్థాన సభ్యులందరూ అతడిని అనుసరించారు. 'బీర్బల్ నీకంటే మించిన తెలివైవాడు లేనే లేడు.' అని వ్యాఖ్యానించాడు.

## నీళ్లవాపు

పిల్లలకు వానలో తడవటం అన్నా, నీళ్లలో ఆడుకోవడం అన్నా మహా సరదా. వేసవిలో స్నానాల గది నుంచి ఓ పట్టాన బయటకి రారు అది సరే నీళ్లలో ఎక్కువసేపు ఈదినా, ఆడుకున్నా చేతివేళ్లలో కాలివేళ్లలో ముడతలు రావడం మీరు గమనించే ఉంటారు. ఎందుకలా జరుగుతుందో ఎప్పుడైనా ఆలోచించారా?

మన శరీర చర్మానికి సీబమ్ అనే సహజ తైలం పొర ఉంటుంది. మనం ఎక్కువసేపు నీళ్లలోనే ఉండటం వల్ల ఈ తైలం కరిగిపోతుంది. దాంతో ఆస్మాసిస్ అంటే ద్రవాభిస్మరణ అనే ప్రక్రియ ద్వారా శరీరంలోకి నీళ్లు ప్రవేశిస్తాయి.

అలా శరీరం లోకి నీళ్లు చేరిన చోటల్లా ఉబ్బెత్తుగా వాచినట్లు కనిపిస్తుంది. మీ శరీరం ముడతలు ముడతలుగా ఎండిన ద్రాక్షపండులా తయారవుతుంది. ఇది చాలా సహజమైనది. కొంత సేపటికి తగ్గిపోతుంది.

# రాష్ట్రపతులు

ఈ నెల మన రాష్ట్రపతులకు చెందిన కొన్ని చిత్రాలతో స్క్రాప్ బుక్ రూపొందిద్దాము.



డాక్టర్ రాజేంద్ర ప్రసాద్
(1950 జనవరి 26 - 1962 మే 13)



సర్వేపల్లి రాధాకృష్ణన్
(1962 మే 13 - 1967 మే 13)



జాకిర్ హుస్సేన్
(1967 మే 13 - 1969 మే 3)



వరాహగిరి వెంకటగిరి
(1969 ఆగస్ట్ 24 - 1974 ఆగస్ట్ 24)



ఫక్రుద్దీన్ అలీ అహ్మద్
(1974 ఆగస్ట్ 24 - 1977 ఫిబ్రవరి 11)



నీలమ్ సంజీవరెడ్డి
(1977 జూలై 25 - 1982 జూలై 25)



**Chandamama**
fun stories & more

New Media

# ENJOY

Animated Short Stories
Audio Stories
Adventure Series

**on mobile**




Mobisodes

Audio Stories

Online Books






TV Shows

Gift or Buy Mobisode

www.chandamama.com

